ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—౧౩.

శ్రీరస్తు.

# శివతత్త్వసారము.

ఇది

మల్లికార్జునపండితారాధ్యవిరచితము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికనుండి
పునర్ముద్రితము.

మొదటికూర్పు ౫౦౦ ప్రతులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

చెన్నపురి:
బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాల.

౧౯౨౨.

వెల, ౧౨ అణాలు.

# విషయసూచిక.


| విషయములు. | పుటలు. |
| --- | --- |
| 1. పీఠిక | |
| 2. ఉపోద్ఘాతము | |
| 3. పద్యోపోద్ఘాతము | ౧ |
| 4. పశుపాశపతిజ్ఞానము | ౨ |
| 5. అద్వైతమతఖండనము | ౩ |
| 6. జగత్కర్తృత్వవిచారము | ౬ |
| 7. భవాదిశబ్దవివృతి | ౭ |
| 8. జగత్కర్తృలక్షణము | ౭ |
| 9. శివభక్తివివరణము | ౮ |
| 10. భక్తులమహిమ | ౧౦ |
| 11. శివనిర్మాల్యము | ౧౭ |
| 12. శివదీక్షితుఁడు | ౧౮ |
| 13. శివభక్తుఁడుకానిపతి | ౧౯ |
| 14. భక్తిలేక ముక్తిలేదు | ౨౦ |
| 15. బాహ్యపూజ చేయవలయును | ౨౧ |
| 16. శివనిందకులం జంపవచ్చును | ౨౨ |
| 17. చచ్చినశివభక్తులకుఁ బరలోకవిధులు వలదు | ౨౩ |
| 18. శివాపచారులకు శిక్ష | ౨౩ |
| 19. దక్షాధ్వరధ్వంసము | ౨౪ |
| 20. ప్రళయవర్ణనము - గణాధిపుల యాటలు | ౨౬ |
| 21. శివగణవర్ణనము | ౨౮ |
| 22. సద్భక్తుల మహిమ | ౩౦ |
| 23. తన్ను గణములలోఁ జేర్పుమని కవిప్రార్థన | ౩౧ |
| 24. కొందఱభక్తులచరిత్రము | ౩౧ |
| 25. భక్తిమహిమ | ౩౫ |
| 26. లఘుటీక | ౩౯ |

# పీఠిక.

ఈకావ్యము నన్నయభట్టునకు రమారమి నూఱుసంవత్సరములు తరువాతను దిక్కనసోమయాజికి రమారమి నూఱుసంవత్సరములు పూర్వమును రచింపఁబడినది గనుక యాంధ్రవాఙ్మయచరిత్రమును దెలిసికొనఁగోరువారి కుపయోగకర మగుమంచిసాధన మని యెంచి, యిది గొప్పప్రబంధము గాకపోయినను, మతసంబంధ మయిన చిన్నశతకమయినను బ్రకటించితిని. ఇదియుఁ గాక నన్నయకును దిక్కనకును నడిమికాలములోఁ బుట్టిన దని నిశ్చయముగ రచనాకాలము తెలిసినగ్రంథ మిది యొక్కటియే. ఈవిషయ ముపోద్ఘాతము నందుఁ జేయఁబడిన కవికాలనిర్ణయమునుబట్టి స్పష్టపడఁగలదు. నన్నెచోడుఁడు నీకాలమువాఁడే కావచ్చునుగాని యాతనికాల మింకను గొంతవఱకు వివాదములోనే యున్నది. కావునఁ బురాతనత్వమునందు నిది యద్వితీయము గాకపోయినను, ద్వితీయ మని చెప్పవచ్చును. అందుచే దీని నాంధ్రలోకమునకు సమర్పింప సాహసించితిని.

నాకు దొరకినప్రతి.[1]

నా కీగ్రంథము ప్రతి యొక్కటియే దొరకినది. అది నరసాపురమందలి శ్రీయుత చదువుల రామలింగయ్యగా రనుజంగమదేవర సంగ్రహములోనిది. ఇది తాటాకుగ్రంథము. ఈసంపుటములో నాలుగుగ్రంథములు గలవు. సంపుటమునందు మొత్తముమీఁద ౧౭౮ కమ్మ లున్నవి. ౧-౨ కమ్మలలోఁ జిల్లర పద్యములు కలవు. ఈపుట లీసంపుటములోనివి కా వేమో. 3 మొదలు ౨౯ వఱకుఁ గమ్మలు లేవు. 3౦-౬౭ వఱకు శివతత్త్వసారమును, ౬౮-౧3౦ వఱకుఁ బాలకురికి సోమనాథకృత చతుర్వేదసార మనఁబడు బసవలింగశతకమును, ౧3౧లో రెండవవైపును ౧3౨-౧3౮ వఱకును భూమికొల్త శ్లోకములును,

[1] ఈ గ్రంథమును మొదటఁ గనిపెట్టిన శ్రేయస్సు గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరి వారిది. వారి ప్రతిని జూచి దీనిని బ్రకటించుట యావశ్యక మని తలంచి తాటాకుగ్రంథమును నేను దెప్పించితిని. కొంతకాలము క్రిందట నరసాపురమునందు తహశ్శీలుదారుగా నున్న మ.రా.రా.శ్రీ. తణుకు సుబ్రహ్మణ్యము పంతులు గారిమూలమున నాకుఁ దాటాకుగ్రంథము లభించినది. వారియెడఁ గృతజ్ఞుఁడను.

౧౩౫-౧౫౫ వఱకు లింగయ్యచే రచింపఁబడిన ద్విపదసానందచరిత్రయు, ౧౫౬-౧౭౪ వఱకు భారద్వాజగోత్ర మహాదేవకుమారుఁ డైనజగ్గుభట్ట రచిత సురాభాండేశ్వర మనఁబడు యక్షగానమును గలవు. వీని కన్నిటికి లేఖకుఁడు అద్దాల వీరన్న. ౧౩౧-వ కమ్మ చివర లేఖకుఁ డిట్లు వ్రాసెను. "స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహన వరుషంబులు . . . . పింగళనామసంవత్సర కార్తిక బ॥౧౩ గురు॥ సర్కి ప్రతినున్న క్రమానను అద్దాల వీరన్న అనుభవసారాయమున్ను శివసారాయమున్ను, చతుర్వేదసారాయమున్ను సారత్రయమున్ను అద్దాల వీరన్న . . . . . భాద్రాయ కుమారుడు వీరన్న స్వహస్తలిఖితం॥ ఈపుస్తకం త్సదువుల రామలింగయ్యగారికి శివార్పితంగా యిచ్చి శరణుచేస్తిమి."

ఇందువలన నీసంపుటపు మొదటి ౨౯ ఆకులలోఁ బాలకురికి సోమనాథ కృతమైన యనుభవసార ముండె ననియు మన మూహింపవచ్చును. ౧౫౫-వ కమ్మలో "రౌద్రినామసంవత్సర శ్రా॥ శు ౧౫ శుక్రవారము సర్కి ప్రతినున్న క్రమానను సానందచెరిత్ర అద్దాల వీరన్న స్వహస్త లిఖితం" అనియు, సంపుటము చివర ౧౭౪-వ కమ్మలో "రౌద్రినామసంవత్సర శ్రావణశు ౧౨ శుక్రవారాన ప్రతినున్నక్రమానను సురాభాండేశ్వరం యక్షగానం అద్దాల వీరన్న స్వహస్త లిఖితం"అనియు నున్నది.

ఈతాటాకుగ్రంథ మెప్పుడు వ్రాయఁబడినదని తెలిసికొనుటకు నిందుఁ జెప్పఁబడిన పింగళ, రౌద్రి నామసంవత్సరంబు లెప్పటివియో కనుఁగొనవలెను. పింగళనామసంవత్సరము క్రి. శ. ౧౯౧౭, ౧౮౫౭, ౧౭౯౭ లో వచ్చును. ౧౯౧౭ మిక్కిలి యాధునికము. కావున ౧౮౫౭ డో, ౧౭౯౭ డో అయియుండవలయును. ఈగ్రంథ మిప్పటి రామలింగయ్యగారికి నీయఁబడినది కాదు. వారితాతగా రగురామలింగయ్యగారి కీయఁబడినది. తాతరామలింగయ్యగారు శుభకృత్తులో, ననఁగా ౧౮౪౨లో లింగైక్యము నొందిరి.[1] కావున నీతాటాకు ప్రతి ౧౭౯౭ లో వ్రాయఁబడిన దని తేలుచున్నది.

ఇదియుఁ గాక యీప్రతి వ్రాసిన తిథి వారములు, పై నీయఁబడినవి లెక్క వేయఁగా క్రీ. శ. ౧౭౯౭ కిఁ బింగళయు, క్రీ. శ. ౧౮౦౦ కి రౌద్రియు సరిపోవుచున్నవి; ౧౮౫౭ కి సరిపోవుట లేదు. కావున నీప్రతి రమారమి ౧౨౫ సంవత్సరముల క్రింద వ్రాయఁబడె నని మనము నిశ్చయింపవచ్చును. ఇప్పటి

[1] ఈ సమాచారము లిప్పటి రామలింగయ్యగా రుత్తరము వ్రాసి నాకుఁ దెల్పిరి.

రామలింగయ్యగారికి నిప్పుడు రమారమి ౮౦ సంవత్సరముల వయస్సున్నం దున వారితాతగారు ౧౭౭౭ ఏండ్లక్రింద నుండియుండుట యాశ్చర్యము కాదు.

లేఖకుఁడైన అద్దాల వీరన్న సమాచార మేమియుఁ దెలియలేదు. ఈతఁడు కమసాలి యనియు, తమనంశమునకు శిష్యుఁ డనియు మాత్రము తెలియుచున్నది యని రామలింగయ్యగారు తెలిపిరి.

'సారము'ను సారాయ మనుట వలననే యీలేఖకుని పాండిత్యము తెలియు చున్నది. 'మక్షికో'మక్షి' యన్నసామెతకు గుఱి యైనవాఁ డగుటచే నీతని వ్రాఁత నెన్నియో తప్పులు పడినవి. అచ్చు టచ్చుట గ్రంథపాతములు కూడఁ గలవు. వీనిని నాకుఁ దోఁచినంతవఱకు సవరింపఁ బ్రయత్నించితిని. నాసవరణ లెవ్వియో, మూలపాఠ మెద్దియో తెలియునట్లు గ్రంథ మచ్చొత్తించితిని.

ఇది శతకమే.

ఇయ్యది చాలవఱకు 'శివా' యను మకుటముగల శతకము. కొన్ని పద్యములచివర 'రుద్రా' 'అజా' 'మహేశా' యనుసంబోధనములు కూడఁ గలవు. కొన్నిటికిఁ దుద నేసంబుద్ధియు నుండదు. ఇట్లిందుఁ గొన్ని చోటుల శతకలక్షణము కానరాకున్నను మొత్తముమీఁద నిది శతక మనియే చెప్ప వచ్చును. పూర్వశైవులలో నిది శతక మనియే చెప్పఁబడుచుండెను. పండితా రాధ్యచరిత్రమునందు, పాలకురికి సోమనాథుఁడు దీనిని శతకమే యనియెను.

ద్వి. శతకంబు శివతత్త్వసారము, దీప

కళికమహానాటకము, నుదాహరణ. (పర్వతప్రకరణము పుట ౩౬౯.)

ఇట్లిది యాంధ్ర భాషయందుఁ బుట్టినశతకములలో మొట్టమొదటిది యని చెప్పవలయును. కావ్యములలో ద్వితీయ మైనను, శతకములలో నద్వితీయమే.

దొరకినగ్రంథ మసంపూర్ణము.

నాకు దొరకినంతవఱకు ౪౮౯ కందపద్యము లీగ్రంథమునం దున్నవి. చివరిపద్యము పూర్తిగ లేదు. నాల్గవచరణములో మూఁడక్షరములు మాత్ర మున్నవి. మిగిలిన భాగము పోయినది. తాటాకుగ్రంథములోఁ బద్యముల సంఖ్యలు పెక్కుతావులఁ బొరపాటుగా వేయఁబడినందున నేనే క్రమ మైన సంఖ్యలు వేసితిని. మూలమునఁ జివరపద్యము ౪౯౧-వది.

ఈసంఖ్యయే సరియైన దగు నేని యిందు రెండుపద్యములు పోయిన వని యెంచవలయును. ఇందుకుఁ దరువాతిపద్యము లేవియైన నుండినయెడల లేఖ కుఁడు పొరపాటున వ్రాయకయైన నుండవలయును, లేదా యంతకుఁబూర్వమే

యవి లోపించినదైన నుండవలయును. గణపవరపు వేంకటకవియొక్క ప్రయోగ రత్నాకరమందును, కస్తూరిరంగకవి రంగరాట్ఛందమునందును దూరాహ్వాన ప్లుతయతికి "ఆరాధ్యదేవర శివతత్త్వసార మందలిది" యని యీక్రిందిపద్య మీయఁబడినది.

కం. ఆయతి త్రిపురాంతకదే,వా యని పిలుచుటయుఁ గటక మంతయు వినఁగాఁ
బాయక కిన్నరబమ్మయ, కోయని యెలుఁగీవె తొల్లి యురగాభరణా!

ఈపద్యము మాతాటాకుప్రతిలో లేదు. కావున మొదట నీశతకమున నింకను గొన్నిపద్యము లుండెననియు, నవి మనప్రతిలో లేవనియు మన మూహింపవచ్చును.

పూర్వగ్రంథముల నచ్చువేయువిధము.

పూర్వగ్రంథములను బ్రకటించువా రిదివఱకుఁ దమయిష్టానుసారము వానిని సవరించి తాము ప్రమాణములుగ గ్రహించిన వ్యాకరణాదిసూత్రము లకు ననుకూలముగ దిద్ది అచ్చువేయుచున్నారు. భారతభాగవతములను మొట్ట మొదట నచ్చువేసినవారు మొదలుకొని నేఁటివఱకు నిట్లే జరుగుచున్నది. కొంద ఱీపద్ధతి నాక్షేపించి యున్నది యున్నట్లె యచ్చొత్తింపవలయు ను గాని మనయిష్టప్రకారము దిద్దఁగూడ దని చెప్పుచున్నారు. ఇందలి యొక్కొక్క మతమునందును గొంత సత్యము లేకపో లేదు, గనుక నూతనగ్రంథమును బ్రక టించువా రీరెంటిని గ్రహింపవలయు నని నాతాత్పర్యము. అనఁగా నున్నది యున్నట్టు లచ్చు వేయవలయును. దిద్దియు నచ్చువేయవలయును. ఇందొక్కటి మానినను భాషాభివృద్ధికి భంగము కలుగు నని నేనెంచెదను. ఎట్లో చూతము:—

ఇదివఱకు గ్రంథములను బ్రకటించినవారు దిద్దినట్లు దిద్దక యున్నది యున్న ట్లచ్చువేసిన నేమిసంభవించును? అందువలనఁ జదువరులకు నర్థబోధ కాదు. మనలేఖకులు సాధారణముగ 'మక్షికకు మక్షి' (ఈఁగకునీఁగ)పద్ధతి నే వ్రాయునంతటి పండితులు గనుక వారియజ్ఞానమూలమున మూల మొకప్పుడు చెడి యేవిధమైన యర్థము నీయదు. దానిని దిద్దక యట్లె ప్రకటించిన యెడల సామాన్యపాఠకులకు నందువలన నేమి యర్థ మగును? పండితులు దిద్దుకొనియెద రందు రేమో. పండితు లెంద ఱుందురు? అట్టివారికే యాగ్రంథమువలనఁ బ్రయోజన ముండును గాని యితరుల కేమి ప్రయోజనము? కావున గ్రంథ మర్థమయి యన్వయించులాగున, సంగతి సందర్భములను బట్టి ప్రకాశకులు తమబుద్ధివైభవము నుపయోగించి, మూలమందుఁ దాము తప్పుకొనినదానిని,

దిద్దవలసినదే. ఇందు కొకయుదాహరణముఁ దీసికొందము. ఒక తాటాకు ప్రతిలో భారతమందలి యొకపద్య మి ట్లున్నది:—

కం. శ్రీమచుళుకవంశశా, ఖామణిమనుమార్గమురాజు కంఠీరవి ధైర్యా
మేరుధరణీధర, ణీమండనధర్మనిరతి నిత్యాభ్యుదయా. [ఆది. ౧-౧.]

ఈపద్యము నీక్రిందివిధముగ సవరించి యచ్చువేసినం గాని యెవరికి నర్థము గానేరదు:—

కం. శ్రీమచ్చళుక్యవంశశి, ఖామణి మనుమార్గరాజకంఠీరవ ధై
ర్యామరధరణీధర ధర, ణీమండన ధర్మనిరత నిత్యాభ్యుదయా.

ఇ ట్లర్థసందర్భమును బట్టి దిద్దవలసినది నిజమే యైన నొకప్పు డిందు మూలకముగ నర్థ మనర్థానహము కావచ్చును. దిద్దువాఁ డెంతపండితుఁ డైనను సర్వజ్ఞుఁడు కాఁజాలఁడు. అతనికి ఛందోవ్యాకరణాదివిషయములకు సంబంధించిన దురభిప్రాయము లుండవచ్చును. అతనికి నాకాలపు చరిత్ర గాని, యప్పటి వ్యవహారములు గాని, పురుషుల నామములు గాని తెలియక పోవచ్చును. ఈకారణములచే నొకప్పుడు మూలమే సరిగ నుండవచ్చును. ఈతఁడే యది త ప్పని భ్రమపడి, తప్పుగ దానిని దిద్దుట సంభవించును. లేదా మూలమే తప్పయి యుండవచ్చును. అది తెలిసినయెడల దానిని నింకొకపథ ముగ దిద్దుటకు వీలుండవచ్చును. కాని ప్రకాశకుఁడు మూలమును దిద్ది యచ్చు వేసినందున మూల మేదియో తెలిసికొనుటకుఁ జదువరులకు వీ లుండదు. ఉన్నది యున్నట్టు లచ్చువేయకపోవుటవలనఁ గల్గునష్ట మిది. దీని కొకయుదా హరణము చూడుఁడు: చిత్రభారతమునం దీపద్యము లున్నవి:—

* * * *

ఇందుశేఖరపాదారవిందయుగళ, భావనాపరుఁ డంగనాపంచబాణుఁ
డతులధైర్యాభిభూతహిమాచలుండు, మానభూనాథుచిత్తాపఖానుఁడతఁడు.

* * * *

మానధనుఁడైన చిత్తాపఖానవిభుఁడు. ౬

శ్రీవీరేశలింగముపంతులుగారీగ్రంథమును బ్రకటించిన సమయమునందు "చిత్తాపఖానుఁ" డనువాఁ డొకఁడు కలఁ డని వారికిఁ దెలియదు. వారికే గాదు. ఇతరచరిత్రకారులకుఁ గూడ బాగుగఁ దెలియ దనియే చెప్పవచ్చును. ఇదియుఁగాక పద్యములోని సందర్భమును జూడఁగా నచ్చట వర్ణింపఁబడిన రాజు

హిందువుగఁ గానవచ్చుచున్నాఁడు గాని తురకవానిగఁ గానరాఁడు. ఇప్పటికిని నీతఁడు హిందువా మహమ్మదీయుఁడా యనినమాట స్పష్టముగఁ దేలలేదు. కావున నీ రేశలింగముగారు 'చిత్తాపఖాను'శబ్దమును 'చిత్తాబ్జభానుఁ' డుగ దిద్ది ప్రకటించిరి. దీనివలన నేమైనది? చిత్తాపఖానుఁడనునొకతురకనవాబు హిందూ దేవాలయములకు దానధర్మములు చేయువాఁడు, మానుఁ డనుతంత్రిగలవాఁ డుండె నని తెలిసికొనుటకు ౩౦ సంవత్సరములు పట్టెను.[1] శ్రీవీరేశలింగముగారు దీని నిట్లు దిద్దుట తప్పని యెవరు చెప్పఁగలరు? అప్పటివఱకుఁ దెలిసినసంగతి సందర్భము లాలోచించి యితరు లయినను నిట్లే మార్చి యుందురు. వేఱు మార్పులు, చేసినను జేయకపోయినను 'ఖాను'శబ్దము తొలఁగించియుందు రనుటకు సందేహము లేదు. కావున వారు చేసినతప్పు, దిద్దుటలోఁగాదు; దిద్దిన భాగము కుండలీకరణమున నుంచియో, లేక యందుపై నొకగుర్తు పెట్టియో, పుటయడుగున మూలమందు 'చిత్తాపఖాను' అనుపాఠ మున్న దని చూపి యున్నయెడల, నీఖానును మరల మనము గుర్తించుటకు నింతప్రయాసము పట్టి యుండదు.

కావునఁ బురాతనగ్రంథముల నచ్చువేయునప్పుడు రెండుమార్గముల నవలంబింపవలయును. మనకుఁ దప్పనితోఁచినవి దిద్దవలయును. గ్రంథపాతములు చేతనైనంతవఱకుఁ బూర్తిచేయవలయును. మూలములో నిట్లిట్లుండె నని యడుగు టిప్పణి (foot-note)లోఁ జూపవలయును. ఇట్లు చేసినయెడల గ్రంథము సామాన్యజనుల కుపయోగపడుటయె గాక, పూర్వచ్ఛందో వ్యాకరణశబ్దజాలచరిత్రాదులను గుఱించి శోధనలజరుపువారికి నవి యుపయోగపడును. ఇదివఱ కచ్చుపడనిగ్రంథమును క్రొత్తగా నచ్చువేయునప్పు డీపద్ధతిని దప్పక యవలంబింపవలయును. పునర్ముద్రణమునందుఁ దా ననుసరించిన ప్రతి యిట్టి దని చెప్పినఁ జాలును. ఈపద్ధతుల నన్నిటి 'నవలంబింప నక్కఱ లేదు. ఈగ్రంథ మచ్చువేయుటలో

మే మేర్పఱచుకొనిన నియమములు.

౧. గ్రంథపాతములను బూరించి కుండలీకరణమునందుఁ జూపితిమి.

---

[1] వరంగల్లులో నున్న పెద్దశాసనము ప్రతియొకటి నే నిటీవలఁ జూచుట తటస్థించినందున నీచిత్తాపఖానుఁడు బైటఁ బడియెను. అంతకుఁ బూర్వము తురుష్కులచేఁ బాడుచేయఁబడిన పాంచాలీశ్వరదేవాలయమును నీతఁడు మరల బాగుచేయించె నని యాశాసనమునం దున్నది. ఇది శా. శ. ౧౪౨౫ (క్రీ. శ. ౧౫౦౩) నాఁటిది. [Epigraphical Reports 1902 iv. 108.] దీనిప్రతి మెకంజీ కలెక్షనులోఁ గూడ నున్నది. [Local Records Vol. 45.]

ఉదాహరణార్థము ౧౯౨-వ పద్యమునందు 'స్వేష్టాచారుగోచర' అని యుండఁగ 'స్వేష్టాచారు [లవాఙ్మానస] గోచర' యని పూరించితిమి.

౨. ఛందోవ్యాకరణనియమముల ననుసరించియు నర్థసందర్భములను బట్టియు మూలమందలి పాఠము తప్పని తోఁచినపుడు దానిని దిద్ది యచ్చొత్తించితిమి. దిద్దినచోట వెంటనే యొకయంకె గుర్తిడి పుటయడుగున మూలమందలిపాఠమును గనఁబఱిచితిమి. ఉదాహరణార్థము: ౧౯౬-వ పద్యమునందు 'పువ్వులలోఁ బుట్టినట్టి పువ్వులు గొరయె' యని యుండఁగ 'పువ్వులలోఁ బుట్టినట్టి ప్రువ్వులు గొ(ఱ)యే' యనిసవరించి 'ప్రువ్వులు' అనుశబ్దముపై సంకెవేసి పుట యడుగున 'పువ్వులు'అని యిచ్చితిమి. దీనికర్థము మూలములో 'పువ్వులు' అనియుండఁగా మేము 'ప్రువ్వులు' అని దిద్దితి మని.

3. బండిఱా లిప్పటి కోశవ్యాకరణముల ననుసరించియే వ్రాసితిమి. కాని మూలమునందు బండిఱ లేనిచోట మే మచ్చులో దాని నుంచినయెడల నాసంగతి చదువరులకుఁ దెలియుటకై యట్టిబండిఱాలను ( ) నిట్టి చిన్నకుండలీకరణములందుఁ జూపితిమి.

౪. అఱసున్నలును మూలమునం దున్నవి లేనివి కుండలీకరణమునలనఁ దెలుపఁబడినవి. తాటాకుగ్రంథమునం దఱసున్నయు నిండుసున్నగనే వ్రాయఁబడియున్నను నిప్పటి లేఖనక్రమము ననుసరించి మేము నిండుసున్న వ్రాయక యఱసున్ననే యుంచితిమి. మూలమునందు నిండుసున్న యేది యఱసున్న యేది యని నిర్ణయించుటకు రెండుమార్గములు గలవు. (1) ఛందస్సును బట్టి (2) నిండుసున్న యైనయెడల లేఖకుఁడు దానితరువాతి యక్షరమును జడ్డగ వ్రాయును; అఱసున్నయైనయెడల దానితరువాతియక్షరము క్రింద నొత్తియుఁడు. 'అమరంగ' ననివ్రాయవలసినయెడల 'అమరంగ్గ' నని వ్రాయును. 'అమరఁగ' ననివ్రాయవలసినయెడల 'అమరంగ' నని వ్రాయును.

౫. మూలమునందు పఙ్క్తిచివరనుండు నకారపొల్లు(న్, ౯)కు బదులు 'ను' అనియు 'నూ' అనియు, లకారపొల్లు (ల్)కు బదులు 'లు' అనియు లేఖకుఁడు పెక్కుతావులలో వ్రాసెను, గాని వాని నన్నిటిని బుటక్రిందఁ జూపుట యనావశ్యకమని మేము చూపలేదు. అట్లే లేఖకుఁడు కొమ్ము వ్రావడికి బదులు పెక్కుతావుల నాంధ్రశబ్దములందు ఋకారమునే యుపయోగించెను. అనావశ్యకమని తలఁచి యీసంగతియుఁ బుటలక్రిందఁ జూపలేదు.

ఈనియమముల నన్నిటిని దప్పకుండ ననుసరించి గ్రంథము నచ్చొత్తిం చుటకు యత్నించితిని. అయినను మానవులకు సహజము లయిన భ్రమ ప్రమాదములవలనను, నీపద్ధతి నూతనమై లేఖకముద్రాపకులకు ననభ్యస్తమై నందునను గొన్నిపొరపాటు లుండిన నుండవచ్చును.

పరిషత్కార్యాలయమున మేనేజరుగా నున్న శ్రీయుత క్రొత్తపల్లి సూర్య రావుగారును, బండితులుగా నుండిన విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు నీ గ్రంథము నచ్చొత్తించుటలో నాకుఁ జాల సాయము చేసిరి. నామిత్రు లైన శ్రీయుత ప్రభాకరశాస్త్రిగారు మొదట నీగ్రంథముయొక్క యునికియు, యోగ్య తయు నాకుఁ దెలిపి దీనిని బ్రకటించుటకు నన్నుఁ బ్రోత్సాహపఱిచిరి. వీరి యందఱియెడ నేను గృతజ్ఞుఁడను.

వేంవిలాస్, ఎగ్మూరు
దుర్మతి సం॥
కార్తీక శు. ౧౫. శా. శ. ౧౮౪౩
౧౫-౧౧-౨౧
అంగారకవారము.

కొ॥ వెం॥ లక్ష్మణరావు.

# ఉపోద్ఘాతము.

## గ్రంథకర్తృత్వము.

"శివతత్త్వసార" మను నీశతకమునకుఁ గర్త మల్లికార్జునపండితుఁడు. ఈ విషయ మీశతకమందలి ౩౮౭-వ పద్యమువలన స్పష్టపడుచున్నది:—

కం. ఒండేమి? మల్లికార్జున, పండితుఁ డన నుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీయాజ్ఞోన్నతి, నుండఁగఁ గాంతు నని కోరుచుండుదు రుద్రా.

పాల్కురికి సోమనాథరచిత 'పండితారాధ్యచరిత్ర'మునకు నాయకుఁడును వీరశైవగురువును నగుమల్లికార్జునపండితారాధ్యుఁడే యీశతకమునకుఁ గర్త యని యాచరిత్రగ్రంథమునలననే తెలియుచున్నది. పండితారాధ్యచరిత్రమునందుఁ బండితునిచే 'శివతత్త్వసారము' రచింపఁబడియె నని స్పష్టముగఁ జెప్పఁబడినది:—

ఈక్షితిఁ జను పూర్వపక్షసిద్ధాంత, పక్షముల్ తత్కర్మభాగైకపూర్వ
పక్షేతరజ్ఞానపక్షసిద్ధాంత, పక్ష వేదార్థోపపాదితపరమ
శైవాత్మకాచారసంసిద్ధి శుద్ధ, కేవలభక్తిసద్భావనోపేత
వీరమాహేశ్వరాచారమార్గాను, సారియై 'శివతత్త్వసార' సత్కృతిని
గావె కేవలభక్తిగలిఁ బ్రతిష్ఠించి, యాదటఁ దాను సన్మార్గ వర్తించు
చున్నవాఁ డని వెండియును బ్రశంసింప, మన్ననఁ బేర్చిన మల్లికార్జునుఁడు.

దీక్షాప్రకరణము పుట ౪౯.*

ఆరాధ్యులవారిని శివుండు జన్మమెత్తుటకుఁ బొమ్మని స్వర్గమునుండి భూమిమీఁదికిఁ బంపినపుడే యీ 'శివతత్త్వసారము' నుపదేశించెనఁట. చూడుఁడు శివవాక్యము:—

శివమహత్త్వప్రతిష్ఠితవచస్సిద్ధి, శివతత్త్వసారసంచితకళావృద్ధి
. . . . . . . ఒసఁగెద.

దీక్షా ప్ర. పుట ౮-౯.

---

*వరంగల్ లోని శివసర్మవర్ధనీ రామలింగేశ్వరముద్రాక్షరశాలలో శా. శ. ౧౮౩౧ సంవత్సరమున నచ్చుపడిన పండితారాధ్యచరిత్రమును నే నుపయోగించినాను.

ఈగ్రంథము నారాధ్యులవారును, వారిశిష్యులు, నితరభక్తులును సాధారణముగ నెప్పుడును బఠించుచుండినట్లు పండితారాధ్యచరిత్రమునందుఁ జెక్కుచోటులఁ జెప్పఁబడియున్నది:—

శివతత్త్వసారసంచితమహామహిమ, శివతత్త్వసార మన్నివక్ఫితిఁ బొగడు
దీక్షా ప్ర. పుట ౭౨.

శతకంబు శివతత్త్వసార మాదిగను, గద్యపద్యంబులాకాంక్షఁ జదువుచును
వాద ప్ర. పుట ౧౭౩.

శతకంబు శివతత్త్వసారము దీప, కళిక మహానాటకము నుదాహరణ
. . . , అరుదొందఁ జదువుచు నంకించువారు
పర్వత ప్ర. పుట ౩౬౯.

సోమనాథునిచేతనే రచింపఁబడిన అనుభవసార మనుగ్రంథమునందును మల్లికార్జునపండితుఁ డీగ్రంథమును రచించినసంగతి స్పష్టముగఁ జెప్పఁబడినది:—

సీ. శ్రుతి 'యేకఏవరుద్రో నద్వితీయాయ తస్థే'యనుట యథార్థంబు దలఁప
అవల 'నణోరణీయాన్మహతో మహీయా' నన నదియె యనూనపదము
పంబి 'యవాఙ్గోచరం' బను 'నప్రాప్య మనసాసహ' యనుమాట నిజము
ఏదియుఁగాదనియెడు పరమేశ్వరుఁ డె యెఱుంగు నెద్ది దన్నెఱుఁగ దనెడు
ఎట్టులనుచు సంశయింపక శివతత్త్వ, సారగద్యపద్యసమితిశివుని
మహిమ తెల్పినట్టి మల్లికార్జునపండి, తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

దీనినిబట్టి చూడఁ బండితయ్య శివతత్త్వసార మనుగ్రంథమును గద్యపద్యములుగఁ జేసినట్టు కానవచ్చుచున్నది. 'గద్య' అనుపదము 'హృద్య' కు మాఱుగ లేఖకప్రమాదమునఁ బడినదేమో. అట్లుగాక 'గద్యపద్య' మన్నపాఠమే నిజ మగునేని పండితుఁడు గద్యమందును నొకశివతత్త్వసారమును రచియించి యుండును. ఇప్పుడు మనకు దొరకినది కేవలము పద్యమయము. ఇందే కొంత గద్యమున్నయెడల లేఖకుఁడు దానిని మాత్రము వ్రాయకుండునా?

శతకప్రచారము.

ఇట్లు పాలకురికి సోమనాథుఁడు శివతత్త్వసారమును బండితారాధ్యుఁడు రచించె నని చెప్పుటయే గాక యాశతకమునుండి పండితారాధ్యచరిత్రములోఁ గొన్నిపద్యముల నుదాహరించియున్నాఁడు:—

(శివతత్త్వసారమునందలి పద్యములు.)

కం. బండేమి మల్లికార్జున, పండితుఁ డననుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీయాజ్ఞోన్నతి, నుండఁగఁగాంతునని కోరుచుండుదు రుద్రా. ౩౮౭

కం. దేవా సంసారాంబుధి, లో వెలువడఁ జేసి ప్రమథలోకం బెలుఁగన్
నావాఁడు వీఁడు సుండీ, నావే నన్నుంపవే గణంబుల నడుమన్. ౩౮౬

(పండితారాధ్యచరిత్రలోని ద్విపదలు.)

ఊర్జిత ప్రమథాత్మ యెుండేమి? మల్లి, కార్జునపండితుఁ డనఁగ నిచ్చోట
నుండుటకంటె నెన్నండకో ప్రమథ, మండలిలో భవన్మహాజ్ఞఁ జేసి
యుండఁగఁ గాంతునొకో 'యని కోరు, చుండుదు' నన్నట్టు లనుచుఁ గదయ్య
దేవయీసంసారతీవ్రదుఃఖాగ్ని, లో వెలిప్రమథాదిలోకం బెలర్ప
నావాఁడు వీఁడు సుండీ వేఱుగాఁడు, నా వె నన్నుంపు గణంబులనడుమ.
పర్వత ప్ర. ౪౦౫.

ఇంతియకాదు. ఇందలి కొన్ని ప్రకరణముల సారాంశమును వీలగునంతవఱకు నిందలి శబ్దములతోడనే సోమనాథుఁడు తనగ్రంథమునందుఁ జేర్చెను. ఈవిషయము ముందు వివరముగఁ జర్చింపఁబడును.

పండితారాధ్యచరిత్రముఁ జెప్పినపాలకురికి సోమనాథుఁడు మల్లికార్జున పండితారాధ్యుల మనుమనినాఁటివాఁడు. ఈతనికాలము ౧౨-వ శతాబ్దము నకుఁ జివరను ౧౩-వ శతాబ్దారంభమునను* నగును. ఈతఁడు 'శివతత్త్వసార' మందలి కందములను ద్విపదలలో నే లగున ట్లుదాహరించుటఁ జూడ నప్పటి వఱకే యీగ్రంథము శైవులలో విశేషప్రచారముఁ జెంది యుండె ననియు, దానికి నెక్కుడుగౌరవ ముండె ననియుఁ జెప్పవచ్చును. పండితుని కాలము ౧౧౬౦ ప్రాంత మని వెంటనే చూపఁబోవుచున్నారము, గాన, నీశతకమున కింతవ్యాప్తి ౪౦ - ౫౦ సంవత్సరములలోనే వచ్చిన దని చెప్పవలెను.

ఇతరకావ్యములు.

ఈకవి 'శివతత్త్వసారము'గాక యితరకావ్యములును రచించినట్లు కానవచ్చుచున్నది. పండితారాధ్యచరిత్రలోని యీక్రిందిద్విపదవలన నీతఁడు లింగోద్భవదేవుగద్యము, రుద్రమహిమ, గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము నను కావ్యములను రచించినట్లు మన మూహింపవచ్చును:—

ఉద్యత్ప్రసక్తి లింగోద్భవదేవు, గద్యంబు నా నొక్క గద్యంబుఁ జెప్పి
దేవదేవేశు నాదిమదివ్యలింగ, దేవు లింగోద్భవదేవు నాతఁడును
చోద్యతరంబుగా స్తోత్రంబుచేసి. మహిమ ప్ర. పుట ౨౪౮.

---

* కర్ణాటకవిచరితె, ప్రథమసంపుట పుట 229; ఆంధ్రకవులచరిత్రము, ప్రథమభాగము, నూతనావృత్తి.

మానుగా శ్రీరుద్రమహిమ యన్గృతిన, దానందుఁడగు శ్రీమహాదేవుమహిమ
నాహూథముగ మల్లికార్జునపండి, తారాధ్యు లాద్యులౌ ననఁబ్రతిష్ఠించె

వాద ప్ర. పుట ౨౪౨.

సన్నుతగణనామసంకీర్తనంబు, చెన్నారవాయూరసేయంగఁ దలఁచి
యాద్యభక్తగణసహస్రనామములు, హృద్యంబుగాఁ బఠియించె నె ట్లనిన

మహి ప్ర. పుట ౨౬౧.

ఆసక్తుఁడై యమరారామపురిని, వాసుని నమరేశు వాసవాధీశు
నమరేశ్వరాష్టకంబంద గీర్తించి.

మహి ప్ర. పుట. ౨౬౯.

వారక పర్వతవర్ణన యనఁగ, మీరానతిచ్చిన చారుసత్కృతిని.

పర్వత ప్ర. పుట ౩౨౭.

ఇ వన్నియుఁ దెనుఁగున రచించెనో లేక సంస్కృతకర్ణాటభాషలలో రచించెనో కొన్ని యొకభాషలోను మఱికొన్ని యితరభాషలలోను రచించెనో చెప్పఁజాలము. ఏలయన నితఁడు కర్ణాటకమునందును గవిత్వముఁ జెప్పెను. ఈతఁడు కర్ణాటభాషలో గణసహస్రనామ, ఇష్టలింగస్తోత్ర, బసవగీత లనుగ్రంథములను రచించినట్లు చెప్పఁబడియున్నది. బసవేశ్వరుఁడు పంపిన విభూతిని ధరింపఁగనే యాతనికిఁ గన్నడము వచ్చి యందుఁ గవిత్వము చెప్పఁదొడఁగె నఁట,

పటుభక్తిఁ గర్ణాటభాష నధికరించి, యటమున్న బసవదండాధీశుకడకుఁ
బుచ్చిన జంగమంబును భాక్తవరులు, వచ్చి యాబసవన్న పరమహత్త్వంబుఁ
బ్రస్తుతించుచు సమర్పణసేయు బసవ, హస్తానుగతభూతి యందు నంతటను
గర్ణాటభాషసాంగముగఁ బ్రాణేశుఁ, గర్ణాటగీతసంగతులఁ బాడుచును
మఱియును బసవన్న మహిమయు వినుచుఁ, దఱితఱి బసవయ్యఁ దలఁచి
మ్రొక్కుచును.

మహిమ ప్ర. పుట ౨౫౪.

పైని చేర్కొనఁబడిన గ్రంథములుగాక యీకవి యీక్రిందిగ్రంథములు పఠించె నని చెప్పఁబడియున్నది:—

గద్గదకంఠవికస్వరరసన, ముద్గతస్తనసంయుతవాక్యుఁ డగుచు
హరలీలఁదేలుచు హరలీలఁదనర, హరలీలయనుకృతి హరలీలఁబొగడు; [చు;
మహిమఁజెప్పెడుమహిమ్న స్తవంబునను, మహిమాకరునిమహామహిమకీర్తిం
మలహరణంబగుమలహరణంబునను, మలహరప్రియునిద్రమలహరుఁబొగడు;

---

*కర్ణాటకవిచరితె ప్రథమభాగ. ఈకవిచరిత్ర.

శ్రీమయంబైన యనామయంబుసని, రామయుండగు కరుణామయుఁ బొగడు;
నాయతప్రీతి హలాయుధంబున హ, లాయుధ ప్రియుఁ డ్రిశూలాయుధుఁ బొగడు;
పాంచభౌతికపంచపంచేంద్రియప్ర, పంచదూరు నుతించుఁ బంచగద్దెలను;
శివతత్త్వసార మన్నివకృతిఁ బొగడు.
మహనీయమగురుద్రమహిమయస్తుతుల, మహనీయమగు రుద్రమహిమఁ గీర్తించు;
నలరుసంసారమాయాస్తవంబునను, అలఘుసంసారమాయాదూరుఁ బొగడు;
శంకరగీత భాస్వత్పదావళిని, శంకరుదురితభయంకరుఁ బాడు;
నానందగీతంబులనుపదంబుల స, దానందు భక్తగణానందుఁ బొగడు;
బండరు బసవన్న భవ్యగీతముల, బండరు బసవన్న ప్రాణేశుఁ బొగడు;
ప్రాక్తననూతనభవ్యగీతప్ర, సూక్తుల వెండియు భక్తాత్ముఁ బొగడు.

దీక్షా ప్ర. పుట. ౨౨.

పైద్విపదలలోఁ జెప్పఁబడిన వన్నియు నితనిచే రచింపఁబడినవి యే యని చెప్పుటకు వీలు లేదు. మహిమ్నాదులు సంస్కృతమునందలి ప్రాచీనస్తుతులు. వానినే యీతఁడు చదివె నని యర్థమో? లేక వానిని దెనిఁగించె నని యర్థమో స్పష్టముగఁ దెలియుట లేదు. ఈతనిచే రచింపఁబడిన దని స్పష్టముగఁ దెలిసిన 'శివతత్త్వసారము' ను 'బసవగీతములు' ను గూడ నిందుఁ జేరియున్నవి గనుక మిగిలినవి గూడ నీతనిచేతనే రచింపఁబడె నేమో యన్నసంశయము కలుగుచున్నది. మొత్తముమీఁదఁ బండితారాధ్యుఁడు కవి యని యాకాలమందును దరువాతికాలమందును బ్రఖ్యాతిఁ జెందె నని యీక్రిందివాక్యములవలన స్పష్టపడుచున్నది:—

వివరింప శేషునివేయునాలుకలు, శివకవి మల్లయ్యజిహ్వకు సరియె
. . . వేయేల కవిమల్లువిమ యేంద్రియములు. దీక్షా ప్ర. పుట ౭౪.

శివతత్త్వసారము వెనుకఁబడుటకుఁ గారణము.

కొంతకాలమువఱకు నీగ్రంథము శైవులకు ముఖ్యమైనదిగ నుండినను పాల్కురికి సోమనాథునితరువాత దీనిప్రచారము తగ్గి క్రమక్రమముగ నిది వెనుకఁ బడెను. ఇందుకు సోమనాథుని 'పండితారాధ్యచరిత్ర' యే కారణము. 'శివతత్త్వసారము'నందలి పద్యములయొక్క సారాంశమును వీలయినంతవఱకు మూలశబ్దములతోడనే సోమనాథుఁడు తనగ్రంథమునందుఁ జేర్చెను. ఇప్పుడు మనకు దొరకినశివతత్త్వసారమందు ౪౮౯ కందపద్యములు కలవు. వీనిలోఁ గల

కొన్ని ప్రకరణములే పండితారాధ్యచరిత్రములోఁ గానవచ్చుచున్నవి. అట్టివి కొన్ని యీక్రిందఁ జూపుచున్నాను:—

| శివతత్త్వసారములోని పద్యములసంఖ్య వర్ణింపఁబడినవిషయము. | పండితారాధ్యచరిత్రలోని రూపాంతరిత ద్విపద భాగము. |
|---|---|
| ౨౧ - ౬౬ అద్వైతఖండనము. | పుట ౧౭౭ వాదప్రకరణమందలి వేదాంతవాదఖండనము. |
| ౩౦౦ - ౩౧౮ దక్షాధ్వరధ్వంసము. | పుట ౨౩౩ - దక్షాధ్వరప్రశంస |
| ౩౧౯ - ౩౫౦ ప్రళయవర్ణనము. | పుట ౨౩౬ - ౩౭ ప్రళయలీల. |
| ౩౫౧ - ౩౭౩ శివగణముల వర్ణనము. | పుట ౨౩౭ - మహోతాండవలీల. |
| ౩౭౪ - ౩౭౫ తనను శివగణములలోఁ జేర్చుమని కోరుట. | పుట ౪౦౫ పర్వతప్రకరణమందలి పండితుని చరమప్రార్థన. |

ఆరాధ్యచరిత్రము నింకను వెదకినయెడల నందు శివతత్త్వసారమందలి పద్యముల యర్థముగల ద్విపద లింకను దొరకఁగల వని నాతాత్పర్యము. పైని జూపిన సమానభాగములలో నొక్కొకచోట సోమనాథుఁడు శివతత్త్వసారమందలి శబ్దములనే యుపయోగించి చక్కఁగ ద్విపదలుగఁ జెప్పెను. ఇందు కిదె వఱకు రెండుపద్యములును వానికి సరియైనద్విపదలు నిచ్చియున్నాను. ఇచ్చట నింకఁ గొన్ని యుదాహరణము లిచ్చెదను:—

కం. కల దననోపక లే దని, పలుకఁగనేరక యు మూక బధిరులక్రియ ని
మ్ముల నద్వైతులు దమలో, పల వగతురు భువనభిన్నభావమున శివా. ౪౯

ఇందుకు సరియైన ద్విపదలు.

కలదనంగా నోపకయును లే దనియుఁ, బలుకనేరకమూకబధిరులక్రియను
బరఁగు భువనభిన్నభావంబుఁ జూచి, యరయంగ నద్వైతమనఁగ లావేది.

పుట ౧౭౯.

కం నిర్వచనీయము లేక య, నిర్వచనీయంబు గలదె నిర్వచనీయా
నిర్వచనీయోత్పత్తిన, సర్వాద్వైతంబు చెడదె సర్వానందా. ౩౯

ద్వి. నెక్కొన నిర్వచనీయంబు లేక, నిక్కమనిర్వచనీయంబు గలదె?
నిర్వచనీయ మనిర్వచనీయ, మురివినా నద్వైత మొగి రెంటికగునె.

పుట ౧౭౭.

కం. భూతములు దర్భత్రాళ్లను, హోతల మెక లంటఁగట్టి యూపంబులతోఁ
త్రేతాగ్నులయాగాశ్వము, భూతేశ్వర గంగలోన బోనైచె నజా. ౩౦౩

ద్వి. తడయక సచట హోతల దర్భత్రాళ్లఁ, దొడరి యూపంబులతోడ బంధించి
యత్యాగ్రహమున నాహవనీయగార్హ, పత్యదక్షిణనామపరిమితాగ్నులను
నావృతం బైనయాగాశ్వంబుగాఁగ. పుట ౨౩౫.

కం. ససముద్రద్వీపాచల, వసువతి వడి మీఁది కెగురవైచి సనక్ష
త్రసురావాసాకాశము, వెసఁ గ్రిందికిఁ దివుచుఁ బ్రమథవిభుఁ డొకఁడు శివా. ౩౨౭

ద్వి. జడనిధి ద్వీపాంతసహితధరిత్రి, వడిమీఁది కెగురంగ వైచి యాగ్చచును
మీఁదిలోకములతో మించునాకసము, రాఁదివుచు క్రిందికిఁ బ్రమథేంద్రుఁ
డొకఁడు. పుట ౨౩౭.

కం. యమమహిషశృంగములునిం, ద్రమహాగజదంతములుఁ బ్రతాపముతోఁ డక్క
సమసృష్టి దున్సికొని నీ, ప్రమథులు దాళములువేసి పాడుదురు శివా. ౩౩౧

ద్వి. అలరి యమేంద్రవాహనదంతశృంగ, ములు తాళములువేయు మున్నొక్క
గణము పుట ౨౩౭.

ఈప్రకారముగ నెన్నియో యుదాహరణము లీయవచ్చును. ప్రకరణములకుఁ బ్రకరణములు సోమనాథుఁడు ద్విపదలో రూపాంతరము చేసెను. శివతత్త్వసారమునందు నొక్కొకపద్యములోఁ జెప్పఁబడిన భక్తులచరిత్రములు విపులముగను రసవంతములుగను బసవపురాణమునందును బండితారాధ్య చరిత్రమునందును ద్విపదలలో వర్ణించెను. ఇట్టికారణములచేతఁ బాలకురికి సోమనాథారాధ్యులగ్రంథములే యధికలోకప్రీతికిఁ బాత్రములై యావిషయములనే తెల్పునట్టి పండితారాధ్యుని తత్త్వసారము వెనుకఁబడెను.

ఈయొక్కగ్రంథమే కాదు. మల్లికార్జునపండితారాధ్యులవారు రచించిరన్న యితరగ్రంథములు కూడ నీకారణముచేతనే నామావశిష్టము లయ్యె నని నా తాత్పర్యము. గణసహస్రమాల, రుద్రమహిమ, లింగోద్భవదేవు గద్యము, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము, హరలీల, బసవమహిమ యనుకృతులు పండితయ్యగారిచే రచింపఁబడినట్లు పండితారాధ్యచరిత్రమువలననే కానవచ్చుచున్న దని పైని చెల్పితిమి. ఇం దేదియు నిప్పుడు విడిగాఁ గానరాదు. గణసహస్రమాల, రుద్రమహిమ, పర్వతవర్ణనము ననుప్రకరణములు చిన్నచిన్న కావ్యము లనఁదగినంతవి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునం దున్నవి.

పీనిని మొదటఁ బండితారాధ్యులవారు రచించియుండు రనియుఁ దరువాత వానిని సోమనాథుఁడు తన గ్రంథమునందు ద్విపదగా ననువదించె ననియుఁ దోఁచుచున్నది. పండితారాధ్యచరిత్రమునకు శైవులలో నెక్కుడు ప్రచారము కలిగినందున మూలమునకుఁ బ్రచారము లేకుండఁ బోయియుండును.

కవికాలనిర్ణయము.

పండితారాధ్యునికాలమును మన మాతనిసమకాలికుల కాలమునుబట్టి నిర్ణయింపవలయును. పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రములో నతనిసమకాలికు లయినకొందఱు రాజులయొక్కయుఁ గొందఱు మంత్రుల యొక్కయుఁ బేళ్లు చెప్పఁబడినవి. వానిలో, కల్యాణమందలి బసవేశ్వరుఁడు, చందవోలులోని వెలనాటిచోళుఁడు, పానుగంటి ఉదయమాహనీశుఁడు ననువారు ముఖ్యులు.

బసవేశ్వరుఁడు:—బసవేశ్వరుని భూమిపై నవతారమెత్తుటకుఁ బంపినపుడే శివుఁడు పండితునిగూడఁ బంపె ననియుఁ* బండితారాధ్యులవారు గుంటూరు జిల్లాలోని యమరావతిలో నుండఁగా బసవేశ్వరుని దూత లాతనియొద్దకు వచ్చి రనియుఁ దరువాతఁ బండితుఁడు బసవేశ్వరుని జూచుటకు బయలుదేఱి నైజాము రాజ్యమందలి పానుగంటిమీఁదుగా వనిపుర మనుగ్రామమునకుఁ జేరవఱకు బసవేశ్వరుఁడు కూడలి సంగమేశ్వరునిలో లింగైక్యముఁ జెందె నన్నవార్త రాఁగా మిక్కిలి విలపించె ననియుఁ జెప్పఁబడియున్నది.† కల్యాణపురమున రాజ్యముచేసిన కాలచురిరా జగుబిజ్జలునకు లింగాయితమతస్థాపకుఁ డైనబసవేశ్వరుఁడు ముఖ్యమంత్రి. బిజ్జలరాజు క్రీ. శ. ౧౧౬౦ లో రాజ్యమునకు వచ్చి ౧౧౬౭ లో బసవేశ్వరుని శిష్యులచేఁ జంపఁబడియెను. బసవేశ్వరుఁడు ౧౧౬౮ లో బిజ్జలుని కుమారునిచేఁ జంపఁబడియెను.‡ కావునఁ బండితారాధ్యుఁడు ౧౧౬౦-౭౦ ప్రాంతమువాఁ డని మనము నిశ్చయింపవచ్చును.

వెలనాటిచోడుఁడు;—పండితారాధ్యుని మఱియొకసమకాలికుఁడు వెలనాటిచోడుఁడు. పండితుఁడు చనదవోలు (చందవోలు) గ్రామమునందు వెలనాటిచోడుని సభకుఁ బోయి బౌద్ధులతో వాదించినట్టును, బౌద్ధగురువును, ఈతనిశిష్యులు చంపఁగా రా జీతనికనులు తీయించినట్టును, అందుపైఁ బండితుఁ డారాజును శపించి యమరావతికి వెడలిపోఁగా నారాజు నశించినట్టును,

* దీక్షాప్రకరణము పు ౖ ౮. † మహిమాప్రకరణమందలి పండితప్రలాపము పుట ౭౦౧ మొదలయినవి చూడు. ‡ Rice ; Mysore Vol. I, p. 392.

వాదప్రకరణమునందును మహిమాప్రకరణమునందును జెప్పఁబడినది.* చందవోలులో వెలనాటిరాజులు రాజ్యముచేయుట ప్రసిద్ధము. ఆ వంశమునందు, వెలనాటిచోడనామముగల రాజులు తాతమనుమ లిద్ద ఱుండిరి. వీరి శాసనములనుబట్టి కాలనిర్ణయము చేయఁగా మొదటివెలనాటిచోడుఁడు క్రీ. శ. ౧౧౧౫ మొదలు ౧౧౩౬ వఱకు రాజ్యముచేసెను. రెండవవెలనాటిచోడుఁడు క్రీ.శ. ౧౧౬౩ మొదలు ౧౧౮౦ వఱకు రాజ్య మేలెను.† ఈ రెండవవెలనాటిచోడరాజే తెనుఁగుదేశమందు వెలనాటిచోడుఁ డన్నపేరుతో విశేషముగ ఖ్యాతిఁ గాంచెను. ఇతఁడు బసవేశ్వరునికి సమకాలీనుఁడు. కావునఁ బండితుఁ డీతని సభకే వెళ్లియుండె నని మనము నిశ్చయముగఁ దెలిసికొనవచ్చును.‡ ఈరాజు

* చూఁడు పుటలు ౧౭౦ - ౭౧.

† రెండవవెలనాటిచోడునిశాసనములు పెక్కులు గలవు. వాని నన్నిటి నుదాహరించుట యనావశ్యకము. Epigraphical Reports, Southern Circle 238 of 1893 అనునది శా. శ. ౧౦౮౫ (క్రీ. శ. ౧౧౬౩) నాఁటిది. ఇంతకుఁ బూర్వపువి యాతనిశాసనములు లేవు. చివరసంవత్సర మగు శా. శ. ౧౧౦౨ (క్రీ. శ. ౧౧౮౦) నాఁటిది Ep. Rc. 413 of 1893 అనునది. ఈమధ్యకాలపువి పెక్కుశాసనములు కలవు. వానిలో వెలనాటిరాజులవంశవృక్షమును దెలుపునట్టి Ep. Rc. C. P. 23 of 1917 అనునది ముఖ్యము. ఇది శా. శ. ౧౦౯౧ (క్రీ. శ ౧౧౬౯) నాఁటిది. అట్లే వీరివంశమును దెలుపునట్టి పిఠాపురశాసనమును (Ep. Ind. Vol. IV p. 32) వీరిచరిత్ర దెలిసికొనఁగోరువారు చూడఁదగినది. దానిని రెండవవెలనాటిచోడుని మనుమఁడగు పృథ్వీశ్వరుని తల్లి శా. శ. ౧౧౦౭ (క్రీ.శ. ౧౧౮౫) లో వేయించినది. కాని యొక హెచ్చరిక చేయవలెను. పృథ్వీశ్వరునిశాసనమును బ్రకటించిన హుల్ష్‌దొరగారు రెండవవెలనాటిచోడుఁడు పృథ్వీశ్వరుఁడు నొక్కఁడే యని వ్రాసిరి. ఇది పొరపాటు. వీరిద్దఱు తాతమనుమలు. రాజేంద్రచోడనామము గలరెండవచోడుఁడు గొంకనికిని సబ్బాంబికకును బుట్టినవాఁడు. (C. P. 23 of 1917) పృథ్వీశ్వరుఁడు తృతీయగొంకనికిని జయాంబికకుఁ బుట్టినవాఁడు. (జయాంబిక పిఠాపురశాసనము Ep. Ind. IV p. 32) రెండవ వెలనాటిచోడునితరువాత నాతని కుమారుఁ డైనమూఁడవగొంకఁడు బహుస్వల్పకాలము రాజ్యముచేసినట్లు కానవచ్చుచున్నది. మనుమఁడైన పృథ్వీశ్వరుఁడు ౧౧౮౫ వఱకే రాజ్యమునకు వచ్చినట్లు తోఁచుచున్నది. కేయూరబాహుచరిత్రమువలనను వెలనాటిచోడుఁడును బృథ్వీశ్వరుఁడును వేఱువేఱు పురుషు లని స్పష్టపడఁగలదు. ఇందును నొకపొరపాటు గలదు. పిఠాపురశాసనమునందు వలెఁ జోడునికొడుకు గొంకఁడు, వానికొడుకు పృథ్వీశ్వరుఁడు నని చెప్పక, చోడునికొడుకు పృథ్వీశ్వరుఁ డని చెప్పఁబడియున్నది. ఎట్లయిన నిద్దఱు నేకపురుషులు కాఁజాలరు. ఈపరస్పరవిరుద్ధములను సమన్వయించి వెలనాటిచోడులచరిత్రమును వేఱుస్వతంత్ర వ్యాసమునఁ జర్చింపఁబోవుచున్నాను గాన విరమించెద.

‡ పండితుఁడు మొదటివెలనాటిచోడునికాలమునఁ గూడ నుండిన నుండవచ్చును గాని రెండవచోడునికాలమున నుండినమాట నిశ్చయము.

నకే చోడుఁ డనియు, రాజేంద్రచోడుఁ డనియు, కులోత్తుంగరాజేంద్రచోడుఁ డనియు నామాంతరములు కల వని శాసనములవలనను, కేయూరబాహు చరిత్రమందలి కృత్యాదిపద్యములవలనను స్పష్టము.

ద్వి. అంత రాజ్యార్థమై యనిఁ బోరి యతని, సంతాన మెల్ల నిస్సంతాన మయ్యె.

మహిమా. పుట ౨౬౧.

అని వెలనాటిచోడుని గుఱించి వ్రాయఁబడియున్నది. చోడునితరు వాతఁ ద్వరలోనే రాజ్యమునకువచ్చిన యాతనిమనుమఁ డగుపృథ్వీశ్వరుఁడే వెలనాటిరాజులలోఁ జివరవాఁడుగఁ గానవచ్చుచున్నాఁడు. ఈతనినే నెల్లూరు మనుమసిద్ధితండ్రి యైనతిరుకాళవిభుఁడు చంపె నని కొందఱయభిప్రాయము. అయినను నీవిషయ మింకను శోధింపవలసియున్నది. ఎట్లయినఁ బృథ్వీశ్వరుఁడు చివరవాఁ డనుటకు సందేహము లేదు.

ఉదయావనీశుఁడు:—పండితారాధ్యుని మాఁడవనసమకాలికుఁడు పానుగంటి ఉదయావనీశుఁడు. పండితుఁడు పానుగల్లుగ్రామమునకు వెళ్లినప్పుడచ్చటి యుదయుఁ డనురాజు రాజ్యముచేయుచుండెను. ఆతఁడు చోడవంశము వాఁడు.* ఆతనిమంత్రి పింగలి గోవిందప్రధాని. పానుగల్లు నైజామురాజ్యమునందు మహబూబ్‌నగర్ జిల్లాలో నాగర్‌కర్నూలుతాలూకాలో నున్నది. ఇది పూర్వము గొప్పదుర్గము. ఈప్రాంతమునఁ బండితునికాలమున నుదయ చోడుఁ డనురాజు† రాజ్యముచేసినట్లు శాసనములవలనఁ గానవచ్చుచున్నది.

---

* మహిమాప్రకరణము పుట ౨౯౭.

† పండితారాధ్యచరిత్రములోఁ జెప్పఁబడిన ఉదయావనీశుఁడు గూడఁ జోడుఁడే యనుటకు నందు రెండుప్రమాణములు కలవు. (౧) ఈరాజు నుద్దేశించి యీతనిసేవకుఁ డిట్లు చెప్పెను. 'జోళవాళికగాక ఖోణీతలేశ। వేళవాళికిఁ గర్తవేయెట్టు లనిన' (పుట ౨౯౭). ఇందుఁ జోళవాళి = చోళపాళి, చోళరాజ్యము; వేళవాళి = వేళపాళి = కాలపాళి = కాలునిరాజ్యము అనినే నర్థము చేసికొంటిని. కాని యర్థము స్పష్టమనుటకు వీలులేదు. ఈప్రమాణ మెట్టున్నను ఇంకొకప్రమాణమువలన నీతఁడు చోడుఁడె యనుట స్పష్టపడుచున్నది. (౨) పండితారాధ్యుఁడు, ఉదయునకు శాపమిచ్చి గ్రామమునుండి వెడలఁగనే, అచ్చటిరాతికోళ్లు కూసినవఁట, రాతిపాన్న పూసినవఁట. "మసలకపండితమల్లికార్జునుఁడు । వెసఁ దలిర్పఁగ బురివెడలంగ వెనుక । నక్కజంబుగఁ బూచె సంతగల్ పాన్న । కుక్కరోకుర్రని కూసె గల్కోడి" [మహిమాప్రకరణము, పుట ౩౦౧] కల్పాన్నయుఁ గల్కోడియుఁ జోడులవిశేషచిహ్నాము లని మనకు నన్నెచోడునికుమారసంభవము మొదలయినవానివలనఁ దెలియును.

ఉదయచోడుని దండనాయకులు శా. శ. ౧౦౮౪ (క్రీ. శ. ౧౧౬౨) లో వేయించిన శాసన మొకటి* జడచర్లలోఁ గలదు. జడచర్ల నైజామురాజ్యము నందుఁ బానుగంటికి నుత్తరమునఁ బదునైదుక్రోశములమీఁదఁ గలదు. ఈ సంవత్సరముననే ప్రథమరుద్రదేవునిచే వేయించఁబడిన హానుమకొండశాసన మునందును నీచోడోదయుఁడు పేర్కొనఁబడియె. రుద్రుఁడు చోడోదయుని గెల్చినట్లును ఆతనిరాజధాని యైనకందూరును గాల్చినట్లును నీశాసనమందుఁ గలదు. కందూరు పానుగంటికి సమీపముననె యున్నది. ౧౧౬౨ ప్రాంత మున అనఁగాఁ బండితారాధ్యునకు మన మితరప్రమాణములవలన నిర్ణయిం చినకాలమందుఁ బానుగంటివైపున నొకయుదయావనీశుఁ డుండె నని స్పష్ట పడుచున్నది.

ఇట్లు పండితునిసమకాలీను లైనయొక్కమంత్రి శేఖరునియొక్కయు, నిద్దఱు రాజులయొక్కయుఁ గాలమును స్వతంత్రములయిన వేఱ్వేఱు శాసనప్రమాణ ములవలన క్రీ. శ. ౧౧౬౦-౭౦ ప్రాంత మని నిశ్చయింపఁ గలిగితిమి గనుక యిది నిజమైనకాలనిర్ణయ మనియే యెంచవలయును.

బుద్ధరాజు:—'చందవోలు కైఫీయతు' అనుదానిలోఁ బండితునికసులు దీయించినవాఁడు కొండపడమటి బుద్ధరాజని చెప్పఁబడియున్నది.† ఈతఁడు మనవెలనాటిచోడుని బావమఱఁది, భార్యకుఁ దోఁబుట్టినవాఁడు, అతనికి మంత్రిగ నుండెను. ఈతనిశాసన మొకటి శా. శ. ౧౦౯౩ (క్రీ. శ. ౧౧౭౧) నాఁటిది చందవోలులోఁ గలదు.‡ కావున నందువలనను మన మిదివఱకుఁ జేసినకాలనిర్ణయమే సరిపోవుచున్నది.

ఇంకొకప్రమాణము:—పైప్రమాణములకంటెఁ బ్రబలమైనది కాకపో యినను, ఈకవికాల మూహించుట కింకొకమార్గము కలదు. పండితారాధ్యుని చరిత్రము వ్రాసిన పాలకురికి సోమన పండితునిసమకాలికుఁ డైన బెలిదేవి వేమ నారాధ్యుల మనుమనిశిష్యుఁడు§ తాతమనుమలకు రెండుతరము లంతరము

---

* Lithic Records of Hyderabad by Mr. Ramakrishna Kavi.

† లోకల్ రికార్డ్సు సం. ౧౯, పుట ౪౩౩.

‡ Ep. Ind. Vol. VI p. 268.

§ పేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమ । నారాధ్యులను పరమారాధ్యదేవు । మనుమనిశిష్యుండ. [దీక్షా. పుట ౪]. పండితుఁడును వేమనారాధ్యుఁడును సమకాలికులనుటకు—పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవివేమ । నారాధ్యులాదిగా నలరుజంగములు । దవిలి పండితవిభు దర్శించువేడ్క . . . సను దెంచుచుండఁగ. [దీక్షా. పుట ౫౩].

గనుక తరమునకు ౩౦ సంవత్సరముల ప్రకారము ౬౦ సంవత్సరములయంతర ముండిన నుండవచ్చును. శా. శ. ౧౧౪౪ (క్రి. శ. ౧౨౨౨) లో గ్రంథము రచించితి నని వ్రాసికొనిన కన్నడకవి యగు సోమరాజు పాలకురికి సోమనాథుని స్తుతించియున్నాఁడు.* ఇద్దఱు కవులును సమకాలికు లనుకొన్నను నంతకు ౬౦ ఏండ్లకుఁ బూర్వపువాఁ డగుపండితుఁడు క్రి. శ. ౧౧౬౨-వ సంవత్సర ప్రాంతమువాఁ డగును. ఇదివఱకుఁ జేయఁబడిన కాలనిర్ణయము నియ్యది బల పఱుచుచున్నది.

శతక మెప్పుడు వ్రాసెను:—ఇట్లు పండితారాధ్యుని కాలమును నిర్ణయించి యీశతక మాతఁ డెప్పుడు నిర్మించెనో యాలోచింతము. ఈశతకమునందు బండరు బసవఁడు, మడిమెల మాచయ్య పేర్కొనఁబడిరి. బండరు బసవఁడు విష మెత్తి త్రాగి శివభక్తిమహిమచే బ్రతికె ననియు (పద్యము ౪౨౯-౪౩౦), మడిమెల మాచయ్య మదపుటేనుఁగును జంపెననియుఁ (౪౩౬) జెప్పఁబడియున్నది. బండరు బసవఁ డనఁగా లింగాయతమతస్థాపకుఁ డైనబసవేశ్వరుఁడు నిర్భయముగ విషము త్రాగి బ్రతికియుండె నని బసవపురాణమునందును గథ కలదు. (౨-వ ఆశ్వాసము). మాచయ్య చాకలివాఁడు. బసవేశ్వరుని సభలోనున్న లింగాయతభక్తుఁడు. రాజతనిమీఁదికి మదపుటేనుఁగును దోలఁగా దాని నీతఁడు చంపె నని బసవపురాణమునందుఁ గలదు. (౪-వ ఆ). ఇట్టికథలును మాహాత్మ్యములును బసవేశ్వరుని చివరకాలమునను మరణముతరువాతను గాని బాగుగ వ్యాపించి యుండ ననుకొనుట సహజము. బసవేశ్వరుఁడు క్రి. శ. ౧౧౬౮-న సం॥ ప్రాంతమున లింగైక్యముఁ జెందెను. కావున నీశతక మాసంవత్సరమునకుఁ దరువాత వ్రాయఁబడియె నని యెంచవలెను.

### కవిచరిత్రము.

సాధనములు:—పండితారాధ్యులవారిచరిత్ర తెలిసికొనుటకు పాల్కురికి సోమన వ్రాసిన చరిత్రము† దప్ప నిశ్చయాత్మకమైన వేఱుసాధన మేదియుఁ

* నరసింహాచార్యరచిత కర్ణాటకవిచరితె, పుట ౨౭౦, ౨౭౯.

† పండితారాధ్యచరిత్ర మొకటి తెనుఁగునందు, నొకటి సంస్కృతమునందు, నొకటి కన్నడమునందును గలవు. వీనిలోఁ దెలుఁగుది మొదటిది. పాలకురికి సోమనాథునిచే ౧౩-వ శతాబ్ద ప్రారంభమునందు వ్రాయఁబడినది. మిగిలినవి రెండును తెలుఁగుచరిత్రము ననుసరించి వ్రాయంబడినవి. సంస్కృతచరిత్ర గురురాజనువానిచేతను, కన్నడచరిత్ర నీలకంఠుఁ డనువానిచేతను ౧౫-వ శతాబ్దమునందు రచింపఁబడినవి. (కర్ణాటకవిచరితె ౧ భా. పు. ౧౬౧). కావునఁ గాలమందును

గానవచ్చుటలేదు. అందయినను పండితునిచరిత్ర యత్యల్పముగను, వర్ణనములు స్తుతిస్తోత్రములు మహిమలు నితరభక్తులచరిత్రలు మొదలయినవియే యెక్కుడుగను గానవచ్చుచున్నవి. అట్టివాని నన్నిటిని వదలి యీకవికి సంబంధించిన చరిత్రభాగమును మాత్రము సంగ్రహింపఁ బ్రయత్నించితిమి.

గోదావరిమండలమందలి భీమేశ్వరమున భీమేశ్వరలింగమునకుఁ బురోహితుఁడు (పూజారి) అయిన భీమనపండితుఁ డీతనితండ్రి; గౌరాంబ యీతనితల్లి. వీరిది ఋగ్వేదము, గౌతమగోత్రము.* శ్రీశైలమల్లికార్జునదేవు నుపాసించిన తరువాతఁ బుట్టినందున నీతనికి మల్లికార్జునుఁ డన్న పేరు పెట్టిరి. భీమేశ్వరము నొద్దనున్న కోటిపల్లివాఁ డయిన ఆరాధ్యదేవుఁ డీతనిగురువు. ఈయారాధ్యదేవరకు అవాంతరయ్య గురువుగా నుండెను. ఆరాధ్యదేవరయొద్ద నుండి మల్లికార్జునుఁడు శైవదీక్షనహించి శైవమతరహస్యములను జక్కఁగాఁ దెలిసికొని యాచరించుచుండఁగా నచ్చటిబ్రాహ్మణులు వచ్చి యీతని శైవాచారముల నాక్షేపించిరి. ఈతఁడు వారికి విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, గురుపాదోదకమహిమ, లింగార్చనమహిమ, ప్రసాదస్వీకారమహిమ బోధించి, ఘంటాకర్ణాది పురాతనభక్తుల చరిత్రలు చెప్పి వారిని మెప్పించి పంపివేసెను. వీర మాహేశ్వరాచారమార్గమును దెల్పుచు శివతత్త్వసార మనుసత్కృతిని రచించి యందుఁ జెప్పినప్రకారము తాను నడచుకొనుచుండెను. ఎక్కుడు భక్తితో నద్భుతముగ శివపూజఁ జేయుచుండెను.

పోరంష్ల సూరసానమ్మ యనుభక్తురాలును, బెలిదేని వేమనారాధ్యుఁడును† మఱికొందఱు జంగములును బండితునిఁ జూడవచ్చిరి. అప్పు డాతఁడు

---

ప్రమాణమునందును పాల్కురికి సోమనాథుని తెలుఁగుచరిత్రయే యెక్కుడు గ్రాహ్యమనుటకు సందేహము లేదు. ౧౫-వ శతాబ్దము ప్రారంభమం దున్న శ్రీనాథుఁడు సోమనాథుని ద్విపదకావ్యము ననుసరించి పద్యకావ్యము చేసెను. కాని యది యిప్పుడు కానరాదు. ఇటీవల శివపురపు రాజలింగసూరి యనునాతఁడు, ఇందలి దీక్షాప్రకరణమును 'చారిత్రదీక్షాప్రకరణమ్' అని పేరు పెట్టిసంస్కృతములో వ్రాసెను. అది యచ్చుపడినది. గురురాజకృతమయిన సంస్కృతపండితారాధ్యచరిత్రమును కన్నడార్థముతో శ్రీయుత కతిబసవప్పశాస్త్రిగారు మైసూరిలోఁ బ్రకటించిరి.

* పండితుని సూత్రము సంగతిగాని గోత్రముసంగతి గాని పండితారాధ్యచరిత్రమునందుఁ జెప్పఁబడలేదు. 'చతుర్మతనిర్ణయ'మన్న చిన్నిసంస్కృతపుస్తకమునందు నితనినిగుఱించి చెప్పుచు "ఖ్యాతో గౌతమగోత్రజో గురువరో ఋగ్వేదశాఖాన్వితః" అని చెప్పఁబడియున్నది. ఈచిన్నిపొత్తము వరంగంటి శివధర్మవర్ధనీరామలింగేశ్వరముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. ఇది యెవ రెప్పుడు వ్రాసినది తెలియదు. ఇది యెంతవఱకుఁ బ్రమాణమో చింత్యము.

† ఈతఁడే పాల్కురికి సోమనాథుని గురువునకుఁ బితామహుఁడు.

శివపూజ చేసికొనుచున్నను జంగములు లింగరూపులే యనిన భావముగల వాఁడు గనుక శివపూజయాఁపి వారిని గారవించి జంగమపూజకూఁడ లింగపూజయే యని తెల్పెను. సూరసానమ్మగారు పండితునకు బసవేశ్వరుని మహిమయు నతనియొద్ద నుండిన కొందఱు భక్తుల మహిమయుఁ దెల్పెను.

సనదవోలు (చందవోలు) అను గ్రామమునందు వెలనాటిచోడుఁ డనురాజు రాజ్యముచేయుచుండెను. చందవో లిప్పుడు గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో నున్నది. పూర్వము వెలనాటిరాజులరాజధాని. ధనదపుర మని దానికి నామాంతరము. పండితారాధ్యుఁ డాగ్రామమునకుఁ బోయి తనమతమును బోధింపసాగెను. అచ్చటిరాజుగురువు బౌద్ధుఁడు. అతనిపేరు బౌద్ధపదపదాచార్యుఁడు. ఈతఁడు బ్రహ్మవంశజుఁడఁట.* తాను రాజునకు గురువుగా నుండఁగా నన్యమతస్థుఁ డారాజధానిలో మతబోధ చేయుటచూచి సహింపనోపక యాబౌద్ధుఁడు రాజుతోఁ జెప్పి యొక గొప్పసభ చేయించి మల్లికార్జునపండితారాధ్యు నాసభకు రప్పించెను. ఆసభకు నద్వైతులు జైనులు సాంఖ్యులు చార్వాకాది నానామతములవారు వచ్చియుండిరి. పండితుఁడు బౌద్ధమతము నితరమతములను దనపాండిత్యమహిమచే ఖండించి తనమతమును స్థాపించెను. ఇంతియకాక శివుఁడు శ్రేష్ఠుఁ డనుటకుఁ దనతల యిచ్చెద ననియు, మంటలో దుమికెద ననియుఁ జెప్పి, శివునికంటె నెక్కుడు దైవము కలఁడని యెవరైనను జెప్పిన యెడల వారితల తనకాలితోఁ దన్నెద నని ప్రతిజ్ఞచేసి తనసిద్ధాంతమును నిలుపుకొనుటకై 'రుద్రమహిమ'యనుకృతిని రచించెను. అంతబౌద్ధుఁ డేమియుఁ బ్రత్యుత్తర మీయఁజాలక పండితుని నిందించెను. అందఱును వెడలిపోయిరి.

కాని బౌద్ధుఁడు పండితుని నిందించినందున నాతని శిష్యులకు మిక్కిలి కోపము వచ్చెను. 'అట్టినిందకుని జంపనియెడల నతఁడు ద్రోహికాఁడు; తామే ద్రోహులమగుదు'మని వారుతలఁచిరి. పండితుని శిష్యులలో రేమయ్య దేవయ్య లనువా రీపనికిఁ బూనుకొనిరి. సముద్రములోని† యొకలంకలో నొకబౌద్ధాలయ ముండెను. అచ్చటి కాబౌద్ధుఁడు ప్రతిదిన మొక్కఁడు వెళ్లి వచ్చుచుండును. ఆసంగతి తెలిసినవారు గావున నొకనాఁ డుదయముననే రేమయ్య దేవయ్య లాలంకకు నెవరికిఁ దెలియకుండఁ బోయి దేవుని మరుగున దాఁగి

* బ్రహ్మవంశజు బౌద్ధపదపదాచార్యు । బ్రహ్మఘ్నుఁ జంపింపఁ బాడియే యనుచు ॥
(మహిమా. పుట ౨౪౭.)

† సముద్రము చందవోలునకుఁ దొమ్మిదిమైళ్లమీఁద నున్నది.

యుండి బౌద్ధుఁడు వచ్చి బుద్ధవిగ్రహమునకుఁ జాఁగిలి మ్రొక్కునప్పుడు వానిని జంపి వికృతరూపునిఁ జేసి వెడలిపోయిరి. ఈసంగతి తెలిసి రాజు మిక్కిలి కోపించి పండితయ్యను బిలిపించి యడుగఁగా నతఁడు 'నేనే చేయించితిని; నేనే చంపించితి' నని దోషమంతయుఁ దనమీఁద మోపుకొనియెను. అంత రాజు పండితుని కనులు తీయింపఁగా నతఁడు రాజునకు శాపముపెట్టి యచ్చటినుండి శిష్యయుక్తముగా నమరావలికి వెడలి పోయెను.

చందవోలులో నున్నప్పుడే యీతఁడు "లింగోద్భవదేవగద్య" యచ్చటి దేవునిపైఁ జెప్పెను. లింగోద్భవుని దేవాలయ మిప్పటికిని జందవోలులో నున్నది.

'చందవోలుకైఫీయతు'* అను పుస్తకమునందు నీకథయే యిట్లున్నది. పండితారాధ్యుఁడు శ్రీశైలమునకుఁ బోవుచు చందవోలునకు వెళ్లి పాండీశ్వర స్వామిగుడిలో దిగెను. కొండపడమటి బుద్ధరాజునకు గురువైన బౌద్ధుఁడు బుద్ధాం అనుగ్రామమందుండెను. వాఁడు పండితుని మహిమను జూచి యోర్వ లేక పోయెను. పండితుని ప్రతిదినశివపూజలోఁ గావలసిన యొకపూజాపాత్రను బౌద్ధుని శిష్యుఁడైన బెజ్జుఁ డనువాఁ డెత్తుకొనిపోయెను. పండితుని శిష్యులు వానిని బట్టుకొని చంపిరి. ఈసమాచారము వారు తమ గురువునకుఁ దెల్ప లేదు. అంత బుద్ధరాజు పండితునివద్దకు మనుష్యులను బంపి నరహంతుకున కేమి శిక్ష శాస్త్రీయ మని యడుగగా కనులు తీయుటయే తగినశిక్ష యని పండితుఁడు చెప్పెనఁట. దానిపై బుద్ధరాజు పండితుని కనులు తీయించెను. పండితుఁ డాతనికి శాపమిచ్చి యిఁకమీఁద శైవులెవరును చందవోలులోఁ దీర్థము పుచ్చుకొనఁగూడ దని నియమించి వెడలిపోయెను.

అమరావతి చేరగనే పండితుఁడు చోడునితో భాషించిన పాపంబు పోవుటకును శివనింద విన్నపాపము పోవుటకును శివభక్తుల సహస్రనామగణమాలిక పఠించెను; అమరేశ్వరాష్టకముఁ జెప్పెను.

పండితారాధ్యుఁ డమరావతిలో నుండఁగా బసవేశ్వరుఁ డతనికి భస్మము పంపెను. అచ్చటనే యాతఁడు కర్ణాటకవిత్వము చెప్పమొదలిడెను. తరువాతఁ బండితుఁడు బసవేశ్వరుని జూడవలయు నని కల్యాణపురమునకు బయలుదేరెను.

---

* స్థానికచరిత్రలు (Local Records) సంపుటము ౩౯, పుట ౪౩౩. ఇది క్రీ. శ. ౧౮౧౧ లో వ్రాయఁబడినది.

త్రోవలో సారంగేశ్వరుఁడు దేవుడుగాఁ గల నిడుగుడుము లనుచోట* తన ముఖ్యశిష్యుఁ డగుదోనయ్యగారికి నన్నయయిన పీరచాకిరాజయ్యగారిచేఁ గారవింపఁబడి పానుగంటికిఁ† బోయెను. అచ్చట నుదయుఁడను రాజునొద్దనున్న పింగలి గోవిందప్రధాని పండితునిభక్తుఁడు. కావున నాతనిని మిక్కిలి మర్యాదతో నెదుర్కొని తనయింటికిఁ దోడ్కొనిపోయెను. అచ్చట ధవళేశు నామయ్య అనుభక్తుఁడు కలఁడు. ఇతఁడు రాజునొద్ద స్వంతసేవకుఁడు. (ఖాసా). పండితుఁ డాగ్రామమునకు వచ్చినప్పటినుండియు నాతని భజనలోనుండి రాజుసేవ సరిగఁ జేయకుండెను. అంత రాజునకుఁ గోపమువచ్చి యాతనిని బిలిపించి కోపపడఁగా, దేహముమాత్రము మీదిగాని ఆత్మ మీదికాదు; మీ దేహమును మీరు తీసికొండని గుడిశిఖరము మీఁదికెక్కి యురిపెట్టుకొని చచ్చెను. అంతఁ బండితుఁ డారాజునకు శాపముపెట్టి వెడలిపోయెను.

వనిపురములో శంకరయ్య యనుభక్తుని సపర్యలఁ గొని, కల్యాణమునకుఁ బయలుదేఱగా నంతకుఁ బూర్వ మెనిమిదిదినములక్రింద బసవేశ్వరుఁడు లింగైక్యముఁ జెందె నన్నసమాచారము త్రోవలోఁ దెలిసి పండితున కమితఖేదము కలిగి యాతఁడు బసవని బొగడుచుఁ బ్రలాపించెను.

అంతఁ బండితుఁడు శ్రీశైలపర్వతము వైపునకుఁ బోయెను. వెల్లటూరు‡ నొద్దకువచ్చి తానచట నేయుండి తన ప్రియశిష్యుఁడైన దోనయ్యను గిరిప్రదక్షిణ

---

* 'నిడుగుడుములు' అనునది యిప్పుడు కృష్ణాజిల్లా నందిగామతాలూకా మునగాలజమీందారిలోని ముఖ్యగ్రామమగు 'నడిగూడెము' అని నాతాత్పర్యము. 'మునమున నిడుగుడుములకు నేతెంచి । సవమలాత్ముఁడు పీరచాకిరాజయ్య। ప్రవ్యక్తభక్తి సారంగేశునంప' (మహిమ పు. ౨౯౫) అని చెప్పఁబడియున్నది. ఇప్పుడు 'నడిగూడెము' అనఁబడు గ్రామమునకు 'నడిగుడుములు' అని పూర్వములెక్కలలోఁ బేరుగలదు. ఇచ్చటిదేవుఁడు సారంగేశ్వరుఁడు. ఇది యమరావతినుండి పానుగంటికిఁ బోవుత్రోవలో నున్నది.

† నైజాము రాజ్యమునందు రెండుపానుగల్లు లున్నవి. ఒకటి నల్లగొండ జిల్లాలోను, వేఱొకటి మహబూబ్‌నగర్ జిల్లా, నాగర్‌కర్నూలు తాలూకాలోను కలదు. ఉదయచోడుని స్థలమును బట్టి నాగర్‌కర్నూల్ తాలూకాలోనిదే పండితుఁడు వెళ్లిన పానుగల్లని నిశ్చయింపవచ్చును. ఇంకొక పానుగల్లు (హానుగల్లు) బొంబాయిరాజధానియందు ధార్వాడుజిల్లాలోఁ గలదు.

‡ గుంటూరుజిల్లాలో రెండువెల్లటూళ్ళు కలవు. ఒకటి రేపల్లెతాలూకాలోను, ఇంకొకటి వినుకొండతాలూకాలోను. నైజామురాజ్యమున నల్లగొండజిల్లాలోఁగూడ నొకవెల్లటూరు కలదు. కాని శ్రీశైలమునకు సంబంధించినది వినుకొండతాలూకాలో నిదియే. ఇది వినుకొండనుండి శ్రీశైలమునకుఁ బోవుత్రోవకు నాలుగుమైళ్ళు ప్రక్కగ నుండును.

ము చేసి శివరాత్రివఱకు శ్రీశైలముపైకిఁ బోయి తనవ్రతమును జాత్తిచేయు మని చెప్పి, యతనికి 'పర్వతవర్ణనము' సుడివెను. అతఁడు గిరిప్రదక్షిణము చేసి వచ్చిన తరువాతఁ బండితుఁడు తానునచ్చిన పని యైన దనియు, బసవేశ్వరుఁడు నన్ను బోయెను గనుకఁ దా నుండనక్కఱ లేదనియు నీశ్వరుని బ్రార్థనచేసి భార్యా పుత్రులతో వెల్లటూరులోనే లింగైక్యముఁ జెందెను.

పండితేంద్రుఁడు మరణసమయమునకు వృద్ధుఁ డైనట్లు మనము తలంప వచ్చును. ఎందు కనఁగా దోనయ్యకుఁ గలలోఁ గానవచ్చిన శివుఁడు వృద్ధతా పసవేషము వేసికొనె ననియు, మల్లికార్జునపండితయ్య తనకుఁ బూర్వస్నే హితుఁ డని చెప్పెననియు నున్నది.* పండితయ్య ముసలివాఁడు కానియెడల నాతని పూర్వస్నేహితుఁడ నని చెప్ప శివుఁడు ముసలివేషము వేసికొన నక్కఱ లేదు. ఇదియుఁగాక తాను శ్రీపర్వత మెక్కక శిష్యునినే పెల్లి తనవ్రతసమాప్తి చేయుమని చెప్పుట గూడఁ జూడ నాతఁ డప్పటికిఁ గడువృద్ధై యుండనోపు నని తోఁచుచున్నది. పండితునిమరణము బసవేశ్వరుని తరువాతఁ ద్వరలోనే తట స్థించె నని మన మెంచిన యెడల క్రి.శ. ౧౧౯౦ ప్రాంత మతనిమరణ కాలమని నిర్ణయించుకొనవచ్చును. అప్పటి కాతఁడు ౭౦ ఏండ్లవాఁ డని యెంచినయెడల క్రి. శ. ౧౧౨౦ ప్రాంత మాతనిజన్మకాల మగును. ఇట్లీతఁడు మొదటి వెలనాటి చోడునికాలమునను, రెండవ వెలనాటిచోడునికాలమున నుండిననుండవచ్చును.

### పండితారాధ్యసంతతి.

ఆరాధ్యులవారితరువాత వారిసంతతి యభివృద్ధియై యారాధ్యగురువం శములుగఁ బ్రబలెను. పండితారాధ్యులవా రన్నయింటిపేరు గలవారును వేజెంటిపేళ్లు గలవారును నగునారాధ్యులు తాము మల్లికార్జునపండితారాధ్యుని సంతతివార మని చెప్పుకొనియెదరు. కాని వీ రెవరియొద్దను మల్లికార్జునపండి తుని మొదలుకొని నేఁటివఱకు వచ్చినవంశములను జూపు నెడతెగని వంశవృ క్షము కానరాదు. పండితారాధ్యులవారిలో రెండువిధములు గలవు. ఒకరు మల్లికార్జునపండితుని వంశమువార మనియెదరు. వారిది గౌతమగోత్రము. మఱియొకరు శ్రీపతిపండితుని వంశపువార మనియెదరు. వారిది కౌశికసగోత్రము. మైసూరుప్రాంతమునందు నారాధ్యు లనువారు కొందఱు తాము మల్లికార్జున పండితుని వంశమువార మని చెప్పుకొనియెదరు. పండితారాధ్యచరిత్రము చివర నాతనికుమారుఁ డైన కేదారయ్యవంశమును నతనిశిష్యుఁ డైన యివటూరి

---

* 'మదనసంహరుఁడు శ్రీమల్లికార్జునుఁడు । పొదలుచువృద్ధతపోధనులీల
నరుగుదేరఁగ శరణార్థిసేయంగ । . . . .
నావుడుతపసి దోనయగారవీర । శైవలోకమున కాచార్యుండుపండి
తారాధ్యవిభుఁడు తెప్పైనయున్నవాఁడె । వాడను మునుపూర్వస్నేహితుఁడను.' (పర్వ-పు. ౩౮౦)

D*

సోమనాథయ్యగారి వంశమును నీయఁబడినవి. వాని నీక్రింద నుదాహరించు చున్నాను:—

వంశవృక్షము.

(పండితారాధ్యచరిత్రమునుబట్టి)

భీమన = గౌరాంబ
|
మల్లికార్జునపండితారాధ్య
|
కేదారయ్య
|
మనుపండిత | భీమపండిత | మహాదేవపండిత | చెన్నపండిత.

(కేదారయ్యశిష్యుఁడు) ఇవటూరు సోమనాథయ్య = భూమమ్మ
|
సూరీశ్వరుఁడు | విశ్వనాథప్ప | సింగనమంచి.

కన్నడదేశమునందు గురుదేవుఁడను నొకకవి ౧౫-వ శతాబ్దమున నుండెను. ఇతఁడు సంస్కృతమున "వీరశైవాచార" మనుగ్రంథమును వ్రాసెను. అందుఁదాను మల్లికార్జునపండితుని సంతతివాఁడ నని చెప్పుకొని యీక్రిందివంశవృక్ష మిచ్చియున్నాఁడు:—

*కోటిపల్లి దేశిక
|
భీమపండిత = గౌరాంబ
|
పండితారాధ్య
|
పీఠారాధ్య
|
గురుబసవ
|
గంగాధర | బసవ

బసవ
|
హరియార్య | పండితార్య

పండితార్య
|
గురులింగ
|
గురుదేవ | పండితార్య | బసవార్య | జక్కారాధ్య.

* కర్ణాటకకవిచరితె, ౨-వ భా. పుట ౩౮.

ఈవంశవృక్షమునకును బసవపురాణ వంశవృక్షమునకును సంబంధము కలియుట లేదు. ఇం దేది నిజమో, రెండును నిజమో చెప్పఁజాలము. పండితు నకు కేదారయ్య, వీరారాధ్యు లను నిద్దఱు కుమారు లుండిరేమో? ఉండిన యెడలఁ బండితునికిఁ దరువాత నేఁబది యిఱువది సంవత్సరములకే జన్మించిన పాల్కురికి సోమనాథున కాసంగతి తెలియకుండునా?

మహిమలు.

బుద్ధుఁడు, యేసు, శంకరుఁడు, రామానుజుఁడు మొదలైన మతకర్తల చరిత్రలలోఁ జెప్పఁబడినట్లు పండితారాధ్యచరిత్రమునందును బెక్కుమహిమలు వర్ణింపఁబడినవి. తమగురువు మిగిలిన మతముల నన్నిఁటిని గెలిచె ననియు, నితరమానవులకుఁ జేతఁగాని యద్భుతకృత్యములను దనమహిమచేఁ జేసి చూపె ననియు వ్రాయుట యున్నిమతగ్రంథములందును గానవచ్చుచున్నది. అట్లే పండితారాధ్యచరిత్రమునందలి మహిమలును నని గ్రహింపవలయును. వీనిని మనము నమ్మినను నమ్మకపోయినను వినుటకు వినోదకరములుగ నుండును గనుకను, నాకప్పుడు వీనినిబట్టి కొంతచరిత్రాంశము నూహించుటకు వీలుం డును గనుకను వానిని సంక్షేపముగ నిచ్చట నుదాహరించెదను.

.. .. .. .. ..

పండితుఁ డొకదేవుని యవతారము కాఁడు. నందికేశ్వరుఁడు భూలోక మునందు బసవేశ్వరుఁడు గాఁ బుట్టఁబోవునపుడు శివభక్తిని స్థాపించుటలో నాతనికి సాయపడుటకై శివభక్తి, నంది సర్వజ్ఞత, భృంగి నిష్ఠ, దూర్వాసాదుల శాపశక్తి, రుద్రాదిగణముల ప్రసాదైకరతి, ప్రాక్తననూతన భక్తగణముల ప్రత్య క్షముగఁ గనఁబడుమహిమ, వీరభద్రుని శౌర్యము నను నీగుణములఁ దీసికొని శివుఁ డొకమూర్తిని జేసి నీవు భూలోకమునకుఁ బోయి బ్రాహ్మణుఁడుగఁ బుట్టి శివభక్తిని వృద్ధిచేయు మని చెప్పి పంపెను.

.. .. .. .. ..

వెల్లగొండ మహాదేవయ్య యనుభక్తుఁడు నిద్ర మేల్కాంచి పొరపా టున శివార్చనపాత్రములఁ దన్నెను. అందుకై యాతఁడు తనపాదముల నఱికి కొని శివుని కర్పించెను. పండితుఁ డదిచూచి మహాదేవయ్య యసమానశివభక్తికి మెచ్చి శివునికి దీపారాధన చేసిన నూనె రాచి యాపాదముల మరల నతికించి శివదేవయ్య యెప్పటియట్ల నడచునట్లు చేసెను. పండితారాధ్యచరిత్రము

నందుఁ జెప్పఁబడిన యీకథకు సహకారిగా 'శివతత్త్వసారము' నందు నీక్రింది పద్యము కానవచ్చుచున్నది:—

కం. మలహరుఁడు జలకమాడిన, జలములు విషములకు మందు శస్త్రవ్రణసం
కులమునకు దీపతైలము, త్రిలోచనుని భక్తులకు నతివిచిత్ర మిలన్. ౧౮౬

.. .. .. .. ..

వెలనాటిచోడుఁడు కనులు దీయించెద నని భయపెట్టినప్పుడు పండితయ్య తానె స్వయముగ గోరుగల్లుతోఁ దనకనులు తీసి పళ్లెములోఁ బెట్టఁగా వానికి మరలఁ గనులు వచ్చెను. ఈప్రకారము రెండుసారులు జరిగెను. నాలుగుకన్నులును బళ్లెములోఁ బెట్టఁగా రాజును సభాసదులును జూచిరి. మరల రా జాతని కనులఁ దీయింపఁగా నతఁ డాతని శపించి యమరావతి కేగి యచ్చట శివుని కరుణవలన మరలఁ గనులను బడసెను. అతనికి మూఁడవ నేత్రము గూడఁ గల్గెను.

.. .. .. .. ..

పైకథ యె చందవోలు కైఫీయతులలో మఱియొకవిధముగ నున్నది, దాని నున్నదాని నున్నట్లిక్కడ నుదాహరించెదను:—*

"శవసంవత్సరం తూర్పు దేశములనుంచి యీశ్వరప్రసాద అచ్ఛిన్నతులయినషువంట్టింని అఖండితవీరశైవాచారవ్రతులయినషువంటింని। వానసకులోద్భవుయిన శ్రీమల్లికార్జునపండితారాధ్యులవారు । శ్రీశైలప్రదక్షిణోద్యుక్తులై యీమార్గాన చందవోలువచ్చి। శ్రీపాండేశ్వరస్వామివారి యొక్క ముఖమంట్టపములో వుండి వున్నందున శ్రీమన్మహామండలేశ్వర కొండపడమటిబుద్ధరాజులుంగారి।గుర్వు।బవుధమతానుసరణశాస్త్రప్రవీణుడై।యిక్కడనె వుండినారు గన్కు।మల్లికార్జున పండితారాధ్యులవారి బిరుదులు మొదలయిన పరిశపంచూది।మతద్వేషంచాతను విరోధించి।పరాజయపరచవలెనని। ప్రసంగం చేసినందున। యీశ్వరాంశసంభూతుడు గన్కు । వారుయిచ్చిన ప్రశ్నలు పూర్వపక్షం చేసి । జయనబవుధచారవాకమతముల ఖండనచేసి । పరాజయమును పొందింపచేశిరి । గన్కు తదనంతరం బవుధగుర్వు పరిచారకులు । తమగుర్వు పరాజయం విచారించి । పండితారాధ్యులవారి । శివపూజానిష్ఠాగరిష్ఠత చూచి తన్నిష్టకు విఘ్నం† చాయదలచి పండితారాధ్యులవారి లింగార్చనకాలమందు । నిత్యం ప్రలంగానపిణంచె । నక్షత్రహారతి బెజ్జడనే బవుద్ధుడు యీమరించి

---

* లోకల్ రికార్డ్సు సంపుటము ౧౯, పుట ౪౩౩.

† నిత్యము తాము చేయవలసిన శివపూజావిధానమందు నెట్టివిఘ్నము సంభవించినను, వీరశైవులలోని శీలవ్రతస్థులు, గండకత్తెర యనుదానిని మెడకుఁ దగిలించుకొని శిరస్సు తామే నఱికికొని శివుని కర్పించుచుండిరఁట. శివపూజాద్రవ్యమగు నక్షత్రహారతి లేకపోయినయెడల నాసేవకు విఘ్నముకలుగును, పండితుఁడు మడియును నని బౌద్ధుల యభిప్రాయము.

చోరత్వంశాతను తీస్కుపోతూ వుండగా। పండితారాధ్యులవారి। శిష్యుడికితెలిసి। చందవోల్కి పశ్చిమపార్శ్వంగా వెళ్లుతూవున్న।బెజ్జంణి కనుక్కుని।అత్యంతకోపంచాలేను। గురుద్రవ్యం అపహరించినందున। వాంణ్ని వధంచేసి।ఆనక్షుత్రహారతి తీసుకొనివచ్చి గురువుకు తెలియకుండా। శివపూజా ద్రవ్యంల్లో తెచ్చివుంచినాడు। అటుపిమ్మట బవుధులు కొందరు।పండితారాధ్యులవారి దగ్గిరకు వెళ్లి। అక్రమంగా జీవహింస చేసినవారికి। శాస్త్రోక్తప్రకారంగా। ఏమ్యతగ్గప్రాయశ్చిత్తముకు విధిఏమి నిర్ణయించవలసినదో మాగురువు మిమ్మున అడిగిరమ్మన్నారు అని చెప్పినంతల్లో। యీలాగంటి పని చేయించినవారి కండ్లు తోడించడం విధి అని చెప్పె గన్క అప్పుడు బవుధులు యీక్రమం మీ వల్లనె జరిగిన దని। యీవత్తు తెలియచేసినంతల్లో ఆయన దివ్యజ్ఞానంచేత విచారించి। యిందుకు ప్రతిహతం విచారిస్తిమా అసత్యం పలికినవారము ఆవుతాము। యిది అంత్తా బవుధులు చేసినకృత్యము గదా అని తెలిసి స్థానసంధ్యాధ్యనుష్టానుమతానుసరణశాస్త్రోక్తప్రకారం గాను। శివపూజాక్రియలు జరుపుకుని లింగోద్భవస్వామివారి యెదట కూచుకొండి సదాశివునియందె భక్తివుంచి। యీశ్వరుడికి తన నేత్రములు తీసి। లింగోద్భవునిముందర పెట్టిన తరువాత। అతనిభక్తివిశేషం వల్ల। ఆభక్తునికి తిరిగి కంన్నులు ప్రసాదిస్తు వచ్చినంతల్లో। తనప్రభావం ప్రకటన చేసికొనకు తిరిగి కన్నులు తోడుతూ వచ్చినారూ యీప్రకారంగా ముప్పందుం పతి సంవత్సరం కంనులు తోడి అంత్తట పండితారాధ్యుల వారు। భవులూ* యీప్రకారంగా విసుపరిక్ష చేసినందున కోపంవచ్చి యింతెనుంచి। యీచందవో లులో తింగదారిణులైన వారికి శివపూజచయ్యటానకు హాదహత లేకపో అనిన్ని। యీపట్నం కొంతమట్టుకు బస్తిగా వుండకపోననిన్ని యీబవుధులకు యీస్థలంలో జయంలేకపోవుననిన్ని, శాపంయిచ్చి అక్కడినుంచిలేచి। అగ్రామాన్క దక్షిణబాగాన వునఘువంటి మహాప్రభావంగ గోకర్ణేశ్వరం వెళ్లి। శివసంన్నిధ్యమందు వున్నసమయమున, గోకర్ణేశ్వరస్వామివారు। యీ యనయందు కరుణించినిల్పి। కన్నులు దయచేసినారు। గన్క అక్కడనుంచి శ్రీశైలప్రదక్షిణం వెళ్లినారూ. పండితారాధ్యులవారి శాపంవల్లను। బవుధులు దినదినం క్షీణమై పోయిరి.''†

.. .. .. .. ..

పండితుఁడు చందవోలునుండి వెళ్లునప్పుడు తాను రాజునెదుటఁ దీసిన నాలుగుకన్నులును లింగోద్భవదేవున కర్పించెను. ఆదేవుఁడు వానిని గ్రహించి తనమూఁడుకన్నులకు జత మూఁడుకన్నులు నింతకుఁబూర్వము విష్ణుచే నొక పాదముపై నర్పింపఁబడినకంటికి జతగా రెండవకాలిమీఁద నొకకన్నును ధరించెను.

.. .. .. .. ..

పండితుఁడు చందవోలునుండి వెడలునప్పుడు వెలనాటిచోడుని నీక్రింది విధముగ శపించెను.

---

* లింగధారులు లింగములేనివారి నందఱను 'భవులు' అని యందురు.

† ఈకైఫీయతు ప్రజోత్పత్తినామసంవత్సర చైత్ర శు॥ ౭ సోమవారం ది ౧ తేది యేప్రిలు ఆన ౧౮౧౧ సంవత్సరం దినమున వ్రాయఁబడియె నని గాదిగివర నున్నది.

"ఈ యసంఖ్యాత మహేశ్వరోద్ధతస, మూ మాతక్రోధోద్ధతానలచటుల
వికచితజ్వాలల వెలనాటిచోడ, ధరణీతలాధమేశ్వరపతంగంబు
భస్మమయ్యెడుసూ దద్బంధులు సుతులు, విస్మయంబున నిస్తుభస్మమైపోదు
రని శాపమిచ్చుచు నాపంఙితయ్య"

ఆశాపమహిమచే నాగ్రామమునం దీక్రింద వర్ణింపఁబడిన ట్లుత్పాతములు పుట్టి జనులు పాఱిపోయిరి.

"పురిమహోత్పాతము లుప్పట్టంగఁదొడఁగె.
నేలగాలఁగఁజొచ్చె నింగిపట్టట్టు, చాలిమేఘంబు లాసన్నమై పర్వెఁ
బవలు చుక్కలుగానఁబడియె ధూమ్రంబు, గవిసె నెల్లెడవంటకంబులుపుచ్చె
భూకంపరాన మద్భుతమయ్యె రాత్రి, కాకకౌశికజంబుకము లర్వఁదొడఁగె
గాలిధూళియుఁబర్వెఁగడు మోరలెత్తి, తూలుచుఁబశువులువోరలంగఁజొచ్చె
నింద్రచాపములుః ఖండేందుచాపములు, చంద్రార్కపరివేషజాలములొ్వడిషె;
పతు జేశునకు నంత మంత్రివిరోధ, ముతు బ్రధానవిరోధమును నాప్తభటవి
రోధంబుఁ బుత్రవిరోధంబు నిరప, రాధంబు పుట్టె నూరను మారిమసఁగె
ధరణి వెండియు మహోత్పాతముల్ పుట్టెఁ, బురిజను ల్వెచ్చిరి భూమికినవధి
యదియేలతప్పెఁ దా హరగణక్షోభ, మది యేల తప్పు నాయయ్య శాపంబు?
మొన్నఁ బండితుఁడు సమున్నతిఁ బలికె, నిన్న నుత్పాతము ల్నెలకొనె నేఁడు
పుట్టె గోత్రకలహములు దమలోన, నెట్టుగా నున్నదో యింకఁ జోడనికి
సిద్ధంబు భక్తివిరుద్ధంబు ఫలము, సిద్ధింపనోపుఁ జేసేతన నట్లు
కలహంబుగా నోపుఁ గ్రందుగానోపుఁ, బ్రళయంబుగానోపుఁ బ్రజలకునింకఁ
బురినున్కి యిటమీఁదబుద్ధిగాదనుచుఁ, బొరుగూళ్లకును దమపొందుపట్లకును
వాటువా రిఁక నేగ నడి నొక్కనాఁడు."

కపాలాస్థిమాలలు ధరించినటువంటి భయంకరాకారము గలకంకాళము (అస్థిపంజరము - ఎముకలగూడు) ఒకటికనుపించి కన్నులనిప్పులు రాల్చుచు ఱొమ్ముపైఁద్రొక్కి త్రిశూలముతోఁ బొడిచినట్లు వెలనాటి చోడుఁ డొకదినమునఁ గలఁ గాంచెను. అప్పటినుండియు నాతనియుదరమున నొకగ్రంధి (గడ్డ) పుట్టి దినదినము పెరిఁగి జైనబౌద్ధాదులును వైద్యులు నెన్నియుపాయములు చేసినను మానక,

"ఒకవుచు నొకనాటికొకనాఁడు పుండు, వొకవుచు రంధ్రములొవ్వుచుఁజుట్లు
సెలయుచుఁబ్రేవులు చెదర● చుముజీకి, నలుచుచు వాఁచుచు వ్రయ్యుచుఁగూడ

గ్రుళ్లుచుఁ గదలుచుఁ గూలుచు నూర్పు, లోల్లనయూర్చుచు నూడుచు రసికె
జిలజిల నెత్తురుఁ జీము గాఱుచును, విలివిలియనఁ జచ్చి విడివి చూపఱకు
నేవంగ దోపంగ నిది యెంత పెద్ద, శైవాపరాధికి సర్వపాపునకు
ఘనశివద్రోహికి ఖలునకుఁ దనకు, ననుచు నంతకుపురి కరిగెఁ జోడంపు.
అంత రాజ్యార్థమై యనిఁబోరి యతని, సంతానమెల్ల నిస్సంతానమయ్యెఁ
బాడయ్యె భూమియుఁ బండితవిభుని, యీడితశాపమహిమ్మతఁ జేసి."

మహిమా. పుట ౨౬౦.

.. .. .. .. ..

కన్నడభాష తనకు రావలయు నన్నకోర్కెతో నీతఁడు కల్యాణమునకు బసవేశ్వరునియొద్దకు వర్తమాన మంపెను. అంత నాతఁడు భస్మము పంపెను. దానిని ధరింపఁగనే పండితునకుఁ గన్నడభాష వచ్చెను. అతఁ డాభాషలోఁ గొన్నిగీతములను చెప్పెను.

.. .. .. .. ..

పానుగంటిరా జైన ఉదయానసీశుని బాధవలనఁ దనశిష్యుఁడు నామయ్య యనువాఁ డురిఁబెట్టుకొని చావఁగాఁ బండితుఁడు కోపగించి రాజునకు శాప మిచ్చి యచ్చటినుండి వెడలెను. తరువాత జరిగిన సమాచారము పండితారాధ్యచరిత్రమునం దిట్లు వ్రాయఁబడి యున్నది:—

"కాడింక నీపానుగంట నుండఁగమ, హాదేవుభక్తుల కనుచుఁ గట్టలుక
మసలక పండితమల్లికార్జునుఁడు, వెసఁ దలిర్పగఁ బురి వెడలంగ వెనుక
నక్కజంబుగఁ బూచె నంత గల్పాన్న, కుక్కురో కుర్రని కూసెఁ గల్కోడి
పురిమహోత్పాతముల్వొడ్బె వెండియును, బురముపాడగునని బుధులుగలంగ
విదితశాపోద్ధతవిలయోగ్రవహ్ని, కుదయావనీశుఁ డాహుతియయ్యెఁ బుత్ర
పౌత్రు లన్యోన్యకళత్రాభినిరతి, శత్రులై చీఁకటి చప్పరంబులను
దడయ కానురియచేఁ దనపురిజనము, లడరంగనిస్థాలమై రట్లు గూడ
సంతానమెల్ల నిస్సంతాన మయ్యె"

మహిమ. పుట ౩౦౧.

.. .. .. .. ..

బసవేశ్వరుఁడు తనకు దర్శనమీయకుండఁగనే మరణము నొందినందునకుఁ బండితుఁడు మిక్కిలి విలపింపఁగా నాతనిప్రాణలింగమందు బసవేశ్వరుఁ డాతనికిఁ గానిపించె నఁట.

"లింగార్చనంబుఁ జెల్లించుచుఁ జెలఁగి, మంగళారతులెత్తి మహితతదీయ
లింగగర్భమున నల్లీల నొప్పారు, భంగిగా బసవయ్య భానంబుదోఁప

కనుఁగవ హర్షకంకణములు దొడుగఁ, దనువున రోమాంచతతులు దలిర్ప
గంధరంబున సుగద్గదము నెక్కొనఁగ, బంధురానందవిభ్రాంతిఁ బండితుఁడు [ను
కనువిచ్చి చూచుచుఁ గరమర్థి మ్రొక్కుచును భజించుచు నభిస్తుతులు సేయుచు
ఈమూర్తి యస్మదీ యేష్టలింగము మ, హామూర్తి యైన వృషాధీశమూర్తి"

శ్రీశైలమువైపు వెళ్లి పర్వతము క్రిందనున్న వెల్లటూరిలో నివాసముగా నుండి శిష్యుఁడైన దోనయ్యను గిరిప్రదక్షిణము చేయఁ బంపెను. ఆతఁడు కొంతదూరము పర్వతయాత్ర చేసిన తరువాత నాతనికిఁ గలలో శివుఁ డొక ముసలిజంగము వేషమునఁ గాన్పించి, యొకచె ట్టెక్కించి శ్రీ శైలపర్వతము మీఁద నున్నట్టియుఁ జుట్టు నున్నట్టియు క్షేత్రము లన్నియుఁ జూపి చెప్పి నీకు శ్రీగిరిప్రదక్షిణఫలము వచ్చిన దని యనుగ్రహించెను. శైవమతమునకు గురువైన పండితారాధ్యుఁడు తనకుఁ జిన్ననాఁటిస్నేహితుఁ డనియు నతనికి యాత్రాఫలము సిద్ధించిన దని చెప్పవలసిన దనియు దోనయ్యతోఁ జెప్పెను. అంత దోనయ్య పర్వతము దిగి వెల్లటూరునకు వచ్చి పండితునితో నీసంగతి చెప్పఁగా నాతఁడు సంతోషించెను. శ్రీపర్వతము శివలింగమయముగాన వెళ్లినయెడలఁ గాళ్లతో లింగములఁ దన్నినట్లగును; వెళ్లకున్న మల్లికార్జునుని జూచుట తటస్థింపదు. అని తలఁచి తనను శివలోకమునకుఁ దీసికొని పొమ్మని శివుని బ్రార్థించెను. అంత శివలింగ మాతని నాతని భార్యాపుత్త్రులను దనలోఁ గలుపుకొనెను.

### తెనుఁగుదేశమందు బుద్ధపూజ.

పండితారాధ్యచరిత్రయందు వెలనాటి చోడుఁడును చంద్రవోలుకైఫీయతులోఁ గొండపడమటి బుద్ధరాజును బౌద్ధగురువుల శిష్యులనియుఁ దమగురువుల ప్రోత్సాహమువలన వారు శైవుఁడైన పండితారాధ్యుని కనులు తీయించిరనియుఁ జెప్పఁబడియున్నది. కాని, యీరాజులచే నీయఁబడిన శాసనములన్నియు, దొరకినంతవఱకు శివకేశవుల కీయఁబడిన దానములుగ నున్నవే కాని బుద్ధున కిచ్చినవిగా లేవు. తనకుఁ బూర్వు లయిన వెలనాటిరాజు లందఱును శైవులుగ నుండిరనియు, దానుమాత్రము బౌద్ధమతము నంగీకరించితి ననియుఁ, జరమదశలోఁ జెప్పి చోడుఁడు చింతించినట్లు పండితారాధ్యచరిత్రలో నున్నది.

"ధరణీశ్వరుఁడు తమతరతరంబునను, హరుని భక్తుల కాని యన్యులు లేరు
కనియు వినియు నెఱుఁగని బౌద్ధమతము, దనకుఁ బ్రాప్తంబయ్యె ధర్మేతరంబు

వేదబాహ్యము ముక్తివిముఖంబు శూన్య, వాదంబగును బౌద్ధవాదం బనంగ
పాపంబు దుర్బోధ పాలైతి నింక.    [మహిమా. పుట. ౭౯.

ఇట్లు వెలనాటిచోడుఁడు గాని యాతనిబావమఱఁది యగుబుద్ధరాజు గాని బౌద్ధమతావలంబులనుటకుఁ బండితారాధ్యచరిత్రయుఁ గైఫీయతునుదప్ప మఱి యేయాధారము లేకపోయినను, నాకాలమందును నంతకుఁ బూర్వకాలమందును, గొంతవఱకుఁ దరువాతికాలమందును, దెలుఁగుదేశమునను విశేషముగ. గుంటూరుప్రాంతమునను చందవోలువైపునను బుద్ధునిపూజ యుండెనని శాసనాదులవలన స్పష్టముగఁ దెలియుచున్నది. పూర్వకాలమందు బుద్ధునిపూజ యున్నందునకు గుంటూరుజిల్లా సత్తెనెపల్లి తాలూకాలోని అమరావతీస్తూపమును, చందవోలుకు ౧౮-౧౯ మైళ్లదూరమున నున్న భట్టిప్రోలుస్తూపమును సాక్ష్యములు. చందవోలుభూమిలో జైనబౌద్ధుల రాగిప్రతిమలు పెక్కులు దొరకినవి.*

పండితుని కాలమునందు నాప్రాంతమున బుద్ధోపాసన కల దనుటకుఁ గొన్ని దృష్టాంతములు కలవు. బెజవాడ మల్లేశ్వరదేవాలయమునందు శా. శ. ౧౦౬౮ (క్రీ.శ. ౧౧౪౬) నాఁటిశాసన మొకటి కలదు. అది మహామాండలిక భీమన అనురాజుయొక్క సంధివిగ్రహి (మంత్రి) యైన సోమనప్రెగ్గడచే వేయఁబడినది.† ఈతఁడు "ఆంధ్రధరణి పంచారామముల మహాదేవరలకు బుద్ధదేవరకును జేబ్రోలు నమ్మహాసేనునకు నుం బిదపురము హుంకారశంకరికిఁ గరము రూఢికెక్కిన బెజవాడమల్లేశ్వరదేవరకు నఖండదీపములు" పెట్టించెను. అమరావతిలోఁ గోటకేతరాజు శాసన మొకటి కలదు.‡ అది శా. శ. ౧౧౦౪. క్రీ. శ. (౧౧౮౨) నాఁటిది. ఇందు మూలమున నారాజు బుద్ధదేవునకుఁ గొన్నిగ్రామ

* Chandavolu— ... Close by it were found buried a number of Budhist or Jain copper images now in the library at Bezwada.
Sewell's Antiquities Vol. I, App. p. iii.

† Ep. R. 295 of 1892.

‡ Ep. Ind. Vol. VI, p. 152 &c. "శ్రీమహామండలేశ్వర కోటకేతరాజులు శకవర్షములు ౧౧౦౪ గు నేంటిమాఘశుద్ధ ౧౦ గురువారమున శ్రీబుద్ధదేవరకు సుంకములోనుగా సర్వాయములతో నాచంద్రార్కముగా నిచ్చిన ఊడ్లుకంద్రడిలోని క్రంతేరు కొండపడమటిలోని మేమకొండసూరు డొంకపల్లును. ఈధర్మము నడపనివారు పంచమహాపాతకములు చేసినవారు . . . కోటకేతరాజులు . . . దమకు ధర్మార్థముగా శ్రీబుద్ధదేవరకు నఖండవర్తిదీపంబులు రెంటికినై ఇచ్చిన ఇనుపఎడ్లు ౧౧౦ . . . శ్రీమత్కేతనృప స్సమస్తగురవే గ్రామానస్వరేవాన్య స్సహూాన్ సంప్రాదా త్పుణకేశ్వరాయ విపుల శ్రీస్వర్గసంప్రాప్తయే."

E*

ములు మొదలయినవి యిచ్చెను. ఇతనియుంపుడుకత్తెలును బుద్ధదేవర దేవారాధనకై కొన్ని గొఱియల నొసంగిరి యని తెలియవచ్చుచున్నది.

తరువాతఁగూడ బుద్ధునిఁ దెనుఁగువారు కొంతకాలమువఱకుఁ బూజించుచుండిరనుట శా. శ. ౧౧౫౬ (క్రీ. శ. ౧౨౩౪) లోని బయ్యారంబ శాసనమువలనఁ దెలియుచున్నది.*

ఇట్లు పండితునికాలమునఁ దెనుఁగుదేశమందు బౌద్ధమతము కొంతవఱకుండె నని చెప్పవచ్చును. అది దానియంత్యదశ యనుటకు సంశయము లేదు. కాని యప్పటికి దానికిని హిందూమతమునకును ప్రబల వైర ముడిగి యని యిప్పటిశైవవైష్ణవమతములవలె నుండె నని, యొక్కరాజే శివునకు, విష్ణువునకు, బుద్ధునకు, మఱియితర దేవతలకు దానముచేయుటఁ బట్టి యూహింపవచ్చును. కృష్ణదేవరాయాదులవలె, నిప్పటి పెక్కురాజులవలెను, దామొక సంప్రదాయపువారైనను, అనఁగాఁ దమగురువులొకమతమువారైనను, రాజులు సాధారణముగ నన్నిదేవతలకును దానధర్మము లిచ్చుచుండిరి. అట్టిదేవతలలో బుద్ధుఁడుకూడఁ బూజింపఁదగినదేవతగ నెంచఁబడుచుండెను.

ఇప్పటి స్మార్తులకు సాధారణముగ శివకేశవులు సమానులయినను, ఒకప్పుడు కొందఱకు నప్పయ్యదీక్షితులవలె శివునియందును, కొందఱకుఁ బోతనవలె విష్ణువునందును భక్తియధికమైనట్టు లప్పుడొకానొక రాజునకు బుద్ధునియందు భక్తి యెక్కుడు కల్గియుండిన నుండవచ్చును. అట్టివానికి గురువుల ప్రేరణచే మతోద్రేకము కలిగి యన్యమతద్వేషము కల్గుట వింతకాదు. అట్లె వెలనాటిచోడునకుఁగాని యతనిబావమఱఁదియైన బుద్ధరాజునకుఁ గాని యాకాలమందు బౌద్ధమతమునందు నెక్కుడు విశ్వాసము కలిగి, బౌద్ధగురువుల ప్రేరణచే వారు పండితుని నగౌరవించుటకు యత్నించియుండిన నుండవచ్చును.

చోడుని బావమఱఁది యైన బుద్ధరాజు నామమువలననే వీరివంశమునందు బుద్ధభక్తి యెక్కుడుగా నుండె నని మన మూహింపవచ్చును. చందవోలునకు సమీపమున బుద్ధవాడ యనుగ్రామము కలదఁట. అది పూర్వము బౌద్ధుల నివాసస్థానమఁట.

ఈగ్రంథమందలి మఱివిషయములు.

ఆంధ్రదేశమందలి బ్రాహ్మణులలో నారాధ్యు లన్న యొకతెగ గలదు. వీరు లింగమును ధరించెదరు. ఇట్లు బ్రాహ్మణులలో లింగధారణ చేసికొను

* Ep. Ind. Vol. VI p. 157.

నాచారము తెలుఁగుదేశమునందుఁ దప్ప మఱియెచ్చటను లేదు.* అఱవ దేశమునందు బ్రాహ్మణులలో స్మార్తులనే శైవులందురు. అచ్చట బ్రాహ్మణేతరులలో వీరశైవులు పెక్కురు గలరు. పెక్కుమఠములును, పండారములను, గురువులును గలరు. కాని, వీరు శివాధిక్యతను బోధింతురె కాని, లింగము కట్టుకొనరు. కర్ణాటదేశమునందు బ్రాహ్మణేతరులందు మాత్రము లింగధారులు గలరు. వారిని లింగాయతు లనియెదరు. వీరిది బసవసంప్రదాయము. తెలుఁగుదేశమందలి యారాధ్యులది పండితసంప్రదాయ మనిపించుకొనును. ఈరెండు సంప్రదాయములకును భేద మేమియన నారాధ్యులు శ్రుతిస్మృతులందుఁ బ్రమాణభావము కలవారలై, గృహ్యసంస్కారములను వేదోక్తముగ జరుపుకొనియెదరు. ఒక్కయంత్యసంస్కారమును, బ్రతిసంవత్సరము శ్రాద్ధమును నాగమోక్తముగ జరిపెదరు. జాతినిబాటించెదరు. లింగాయతులు వేదాదికములను మన్నింపరు. భక్తియె వారికిఁ బ్రధానము. తెనుఁగుదేశమందలి జంగము లిట్టివారు.

జందెముతీసి, జాతివిడిచి, తనలోవచ్చి కలియవలసినదిగా బసవేశ్వరుఁడు మల్లికార్జునపండితుని గోరినట్లును, నాతఁడు "భక్తిహీనుఁడినలవు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ"యని ప్రత్యుత్తరము పంపినట్లును జెప్పెదరు. ఈతనిచే నేర్పాటుచేయఁబడిన యాచారములనే యారాధ్యు లనుసరించుచున్నా రని యీసంప్రదాయమువారి యభిప్రాయము.

ఈగ్రంథమునందు శివాధిక్యతను గుఱించి యెక్కువగఁ జెప్పఁబడినను, లింగధారణను గుఱించి యెంతమాత్రముఁ జెప్పఁబడి యుండకపోవుట యాశ్చర్యము! ౨౨౮ మొదలు ౨౩౦ వఱకు శివదీక్షను గుఱించి చెప్పఁబడియున్నది, గాని, యదియె లింగధారణదీక్ష యని కవియొక్క యభిప్రాయ మేమో తెలియదు.

౨౧ మొదలు ౩౦ వఱకు 'పశుపాశపతి' వివేకము చెప్పఁబడినది. ఇదియె పాశుపతశైవసంప్రదాయముయొక్క ముఖ్యసిద్ధాంతము.

౩౧ మొదలు ౬౬ వఱకు నద్వైతులమాయావాదము యుక్తులచే ఖండింపఁబడినది. మాయావాదమును ఖండించుటకై రామానుజకృత శ్రీభాష్యమందును జెప్పఁబడిన, యనిర్వచనీయానుపపత్తి మొదలయినయుక్తులు

* కర్ణాటదేశమునందుఁ గూడ నారాధ్యులు గలరు. కాని వారు పూర్వము తెనుఁగుదేశమునుండి పోయినవారుగనే కానవచ్చుచున్నారు.

కొద్దిలోఁ బండితునిచే నీపద్యములందుఁ జూపఁబడినవి. ఇందువలన నీతఁడు భాష్యాదికములను జక్కఁగఁ జదివినపండితుఁ డని స్పష్టపడుచున్నది.

మాయావాదఖండనమునందు నీతఁడు విశిష్టాద్వైతులతోఁ నేకీభవించి నను, నితరవిషయములలోఁ గేవలద్వైతి. ఈతనిమతమునఁ బ్రపంచము సత్యము, నాత్మకంటె భిన్నము. జీవాత్మపరమాత్మ లొక్కటికాదు. శివునకు జీవునకుఁ బర్వతపరమాణుభేదము కలదు. భక్తితోఁ నీశ్వరుని సేవించినఁ గాని ముక్తి లేదు. కేవలజ్ఞానమునవలన ముక్తిలేదు.

కేవలయుక్తులచేఁ దనమతమును స్థాపించుటకు యత్నించినను, వేద ప్రమాణమును గూడ విడువలేదు. వేదవాక్యములు కేవల ద్వైతమునే బోధించు నని ప్రతిపాదించియున్నాఁడు (౫3) ఇంతియ కాదు. అద్వైతపర ములుగాఁ గానవచ్చెడు వాక్యములకు ద్వైతపరముగ నర్థము చెప్ప యత్నిం చెను. 'అద్వైతపరముగాఁ గానవచ్చెడి వాక్యము లీశ్వరుని యైశ్వర్యాద్వైత మును బోధించునేగాని, జీవశివాద్వైతమును బోధింపవు; అట్లర్థముచేయుట తప్పు. (౬౨) సర్వము శివుఁ డనఁగా, సృష్టియందలి యన్నియు నతని యధీన మని యర్థము. (౬3)' అని యీతఁడు వాదించియున్నాఁడు. 'తత్త్వమసి'యను వాక్యమునకు మధ్వమతస్థులు 'తస్యత్వమసి'యని యర్థముచేయుట మన మెఱుఁగుదుము. పండితుఁ డీయర్థమునే యీక్రిందిపద్యమునందుఁ జెప్పెను:—*

క. జీవుఁడు శివుఁ డనువాక్యము, భావింపఁగ నైక్యమునకుఁ బ్రతిపాదకమే
జీవుం డనఁ బశుభృత్యుఁడు, గావున నీవాఁడ వేఱు గా దనుట శివా. ౮౦

కావున, నీలకంఠశివాచార్యులవారు విశిష్టాద్వైతి యైనను బండితుఁడు మాత్రము ద్వైతి యనియే చెప్పవలయును.

ఈగ్రంథమునందు శివభక్తిమహిమ యెక్కువగఁ జెప్పఁబడి యున్నను, నిందుఁ గొన్నివిశేషములు గలవు. భర్త శివభక్తుఁడు కానియెడల భార్య వానిని విడిచి వేయవలయును; దోషము లేదు (౨3౧-33) అనసూయ నాలాయని యనుమునిపత్న్ను లిట్టు చేసి శివునిచే వరములు వడసిరి. (౨3౮) శివనింద చేయు

* మల్లికార్జునుఁడు ౧౨-వ శతాబ్దమువాఁడు. మధ్వరాయఁడు ౧3-వ శతాబ్దమువాఁడు కావున, 'తత్త్వమసి' యను వాక్యమునకు 'తస్యత్వమసి' (వానివాఁడవు) అని యర్థముచేయుట మధ్వరాయలే పండితునియొద్దినుండి యో, యీమతమువారినుండి యో గ్రహించియుండును. మధ్వరాయ లనఁబడు నానందతీర్థుల కాలమునకొఱకుఁ జూడుఁడి Dr. Bhandarkur's Vaishnavism &c. p. 50.

గ్రంథములఁ గాల్పవలయును. తద్గ్రంథకర్తలఁ జంపవలయును. శివనిందకుని జంపినను, నాప్రయత్నమందుఁ జచ్చినను ముక్తివచ్చును. (౨౭౭-౨౮౦.)

ఇట్లు శివనిందకులఁ జంపవచ్చు నని యీగ్రంథమునందుఁ జెప్పినను, బసవపురాణమునందుఁ గొందఱు భక్తులు భవులను జంపి రన్నకథ లున్నను దరువాతి వీరశైవు లిట్టియమానుషకృత్యముల నొప్పినవారు కారు. కర్ణాటదేశమందలి యబ్రాహ్మణు లగులింగాయతు లేమిఁ తెలుఁగుదేశమందలి బ్రాహ్మణు లగునారాధ్యు లేమి ప్రభుత్వమువారిచే మిక్కిలి శాంతప్రియు లయినవారుగ నెంచఁబడుచున్నారు. కావున నీబోధ నుత్తరకాలీను లైనశైవు లంగీకరింప లే దని యే చెప్పవలయును.

శివునికొఱకు మృతినొందువానికి దినవారములు మొదలయిన ప్రేతక్రియలు చేయఁగూడదు. వానిపుత్రాదులకు సూతకము లేదు.* వాని చావు నకై యందఱును బందుగ చేసికొనవలసినది. (౨౮౧-౨౮౩.)

౨౧౪-వ పద్యము మొదలు ౨౨౨-వ పద్యమువఱకు శివనిర్మాల్యము భుజింపవచ్చుననియు, దానిని శివదీక్షితుఁడు తప్ప నితరులు భుజింపఁగూడ దనియుఁ జెప్పఁబడియున్నది. ఇతరశైవగ్రంథములలోఁ గూడ నిందునుగుఱించి విశేషముగఁ జర్చ యుండును. ఇందుకుఁ గారణ మేమనఁగా శివుని నైవేద్యము నిర్మాల్య మనియు, భుజింపఁగూడ దనియు స్మార్తుల యభిప్రాయము. అందుచే వారు శివాలయములలోని కొబ్బరి మొదలయినప్రసాదములఁగూడ భక్షింపరు. ఇట్లు శివునకు నైవేద్యము చేసినవస్తువు నన్యులు భక్షింపఁగూడ దన్న యూహ జనులకుఁ గల్గినది. దానిని ఖండనచేయుటకును, శివునకు నర్పింపనిది యేవస్తువును భక్షింపఁగూడ దని స్థాపించుటకును నీప్రకరణము వ్రాయఁబడినది. లింగధారులు లింగమునకు నైవేద్యము పెట్టనిది యేవస్తువు భుజింపరు. తుదకు మందుఁగూడ నైవేద్యము పెట్టి భుజింతురు. కొందఱి కిం కొకనియమము కలదు. ఒక్కసారే కావలసినభోజనపదార్థములు వడ్డించుకొనియెదరు. రెండవసారి వడ్డించుకొనరు. నైవేద్యము పెట్టినపదార్థ మంతయు భుజింపవలయును. శివునకు నైవేద్య మైనపదార్థము లింగధారులు దప్ప యితరులు భుజింపరాదు. ఈయాచారముల కన్నింటికిని బైని చూపిన పద్యములలోని బోధయే మూలాధారము.

---

*ఆరాధ్యులలో నిప్పటికి నొకవిధముగ సూతకమును పాటింపరనియే చెప్పవచ్చును; వారు సూతకదినములలో నితరులనుండి విడిగానున్నను, ఆదినములలో సంధ్యావందన శివపూజాదికమును మానరు. ఎప్పటివలెనే చేసికొనియెదరు. స్త్రీలును రజస్వలలైన దినములలోను, బురిటిలోను శివపూజను జేసికొనియెదరు. ఇట్లేల యనియడుగ, యజ్ఞదీక్షితునకు నాశౌచమువచ్చిన యెడలఁ గర్మ విడువఁడు. అట్లే చేయవలయునని చెప్పుదురు.

### భాషావిశేషములు.

ఈకావ్యము తెలుఁగువ్యాకరణము నతిక్రమింపక పూర్వకవిమార్గము నే యనుసరించి సలక్షణముగ వ్రాయఁబడిన దని చెప్పవచ్చును. ఈకవికిఁ బూర్వుఁడు వాఁ డని నిశ్చయముగఁ జెప్పుటకు వీలయినవాఁడు నన్నయయే. నన్నయ కావ్యమందలి లక్షణమును శబ్దజాలమును నీశతకమునందుఁ గానవచ్చుచున్నవి. అందువలన నాసంప్రదాయము పరంపరగా నీతనికాలమునకును వచ్చెనని మన మూహింపవచ్చును.

### స్వల్పవిశేషములు.

ఇట్లు మొత్తముమీఁదఁ బూర్వపద్ధతి నవలంబించినను నన్నయగ్రంథము నందుఁగాని తరువాతివా రగుతిక్కనాదుల గ్రంథములలోఁగాని గానరాని భాషా విశేషములు కొన్ని యిందుఁ గానవచ్చుచున్నవి.

'అనాఁడు' అనుటకు 'అన్నఁడు' (౨౬౯), 'మలహానుఁడు' అనుటకు 'మలహు', (౪౧౪), అను మాఱురూపములు కానవచ్చుచున్నవి. పానలు (౪౬), బడరుఁడు (౨౬౦), పొసపోరు (౪౩౧-౨) అనుక్రొత్తశబ్దము లున్నవి. ఇందు 'పానలు' అనునది పాలకురికి సోమనాథుని గ్రంథములందును, ఇతర శైవగ్రంథములందును గానవచ్చును. 'బడరుఁడు' నన్నెచోడుని కుమారసంభవమం దున్నది. మూఁడవది పాలకురికి సోమనాథుని గ్రంథమునందుఁ గొంచెము మాఱురూపముతో నున్నది. ఈశబ్దముల యర్థములను గుఱించి లఘుటీకఁ జూడనగును. మొత్తముమీఁద నీశబ్దములను శైవగ్రంథకర్తలే విశేషముగ వాడుచున్నట్లు కనఁబడుచున్నది. ఇంకను చిన్న విశేషములు లఘుటీకలోఁ జూడ నగును.

### ప్రాసవిశేషములు.

మనపూర్వలాక్షణికు లెవ్వరును జెప్పనట్టిదియుఁ గర్ణాటభాషలో నొప్పు కొనఁబడినదియు మనపూర్వకావ్యములలో నరుదుగఁ గానవచ్చునదియు నగు నొకప్రాస మిందుఁ గానవచ్చుచున్నది. దీనిని 'పలుపలగిలుకప్రాస' మనవచ్చును. ఒకసంయుక్తాక్షరమునందు మొదటిహల్లు రేఫగా నుండి రెండవది మఱియొక హల్లుగా నున్నప్పుడు నట్టిసంయుక్తాక్షరమునకును రేఫలేని రెండవయక్షరము నకును బ్రాసమైత్రి చెల్లును. ౩౧౭-వ పద్యముఁ జూడుఁడు. ఇందు, కర్మ, నిర్మాత, తమ్ములు, ఇమ్ములు అనుపదములలోని ద్వితీయాక్షరములు ప్రాసస్థానమునం దున్నవి. ౩౨౦-వ ౪౪౪-వ పద్యములలోను నిట్టిప్రాసమే కలదు. ఇది కర్ణాట సంప్రదాయము. ఇట్టిది యాంధ్రగ్రంథములలో గలదా యని విచారింపఁగా నీక్రిందిప్రయోగములు కానవచ్చినవి:—

1. క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుఁగం గపటమున నోర్వనిజనంబులు నా
   చేతిధనమెల్లఁ గొని పరి, భూతిరొనర్చినవిరక్తిపుట్టివెడలితిఁగా.

తిక్కన విరాట. ౧-౧౯౪.

2\. ద్వి. బిజ్జలునకు వినిపింపఁగ నతఁడు, కజ్జమెంతేనియుఁ గలదు పోరాదు.

పా. సోమనాథుఁడు, బసవపురాణము మాడ్డలదేవుకథ.

3\. భగుఱం డంతకవాహినుల్ శరహతిన్ భంజించున ప్లెమ్మెయిన్
తగఱంగా రథపత్త్రముల్ విఱిగి వేదండాంకురానీకముల్
నుగ్గాడం భటకోరకంబు లలరన్ నూత్నాశ్వపుష్పౌఘముల్
మ్రుగ్గింతున్ బరసైన్యపద్మవనమున్ మద్బాణవర్షంబునన్.

నన్నెచోడ కుమారసంభవము ౧౧-౩౮.

4\. క. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు, నప్పురుషునిగొల్వఁగూడ దదియెట్లనినన్
సర్పంబు పడగనీడను, గప్ప వసించినవిధంబు గదరా సుమతీ.

సుమతిశతకము.

ఈ 'వలపలగిలుకప్రాసము' ఇటీవలి లాక్షణికులొప్పినది కాదు. కావున మూలగ్రంథములలోఁ బైనిచూపినట్లు పాఠమున్నను, దాటాకులపై వ్రాయు లేఖకులును నిటీవలి పండితులును వానిని దిద్ది, నేతున్ (నేర్తున్ అను నర్థమందు), కజ్జము (కర్జమను నర్థమందు,) నుగ్గాడన్ (నుగ్గుచేయునను నర్థమందు), మగ్గింతున్ (మ్రుగ్గింతున్ అను నర్థమందు), సప్పము (సర్పమను నర్థమందు), అను నూతనశబ్దములుగ మార్చి, యివి మహాకవిప్రయోగములు గనుక నీరూపములే సాధువు లని వాదించుచున్నారు. కాని యీశబ్దముల యీవిపరీతరూపముల నంగీకరించుటకంటె వీనికన్నిఁటికిని సమానమైన వలపలగిలుక ప్రాసమాకవుల కిష్టమని తలఁచుట లాఘవము గదా? భాషలో నాయా యొక్కొక తావునఁ దప్ప నీవిపరీతరూపములకు మఱియెచ్చటను బ్రయోగము కానరాదు. 'నేతున్' అని విరాటపర్వమునందుఁ దప్ప భాషలో మఱియెచ్చటను గానరాదు. 'సప్ప' మని ప్రాకృతరూపము కలదుగాని యది తెనుఁగులోనికి రాలేదు. సుమతిశతకమునందుఁ దప్ప సప్ప మెచ్చట నగపడదు. ఇట్లే యితరశబ్దములను గుఱించియుఁ దెలిసికొనవలసినది. కావున నీశబ్దములవింత రూపము లాయా కవులకు సమ్మతము లని యనుకొనుటకంటెఁ బూర్వకవులకు నీకర్ణాటసంప్రదాయ మిష్టమనియే యెంచుట మంచిది. కాని చెవులకు నింపుగ లేనందునఁ గ్రమముగఁ ద్యజింపఁబడి యుండవచ్చును.

పండితమఠము.

సంస్కృతపండితారాధ్యచరిత్రమును గర్ణాటభాషాంతరముతో మైసూరునందుఁ బ్రకటించిన శ్రీయుత కఱిబసవశాస్త్రిగారు పీఠికలో నిప్పుడు గుత్తిలోనున్న జంగమమఠమే పరంపరాగత మైనమల్లికార్జునపండితారాధ్యుని మఠమనియు, దానిని భిక్షావృత్తిమఠ మని కూడ ననియెద రనియు వ్రాసియున్నారు. కాని వా రందుకు నేమియు నాధారములు చూపియుండలేదు.

పండితారాధ్యుని మతము జంగమమత మెప్పటికిని గానేర దని నాతాత్పర్యము. ఏలయన మల్లికార్జునుఁడు బ్రాహ్మణత్వము వదలినవాఁడును గాఁడు, సన్న్యాసము పుచ్చుకొనినవాఁడును గాఁడు. జంగమమతమునకు నీరెండును నవశ్యకములు. పండితుని శివతత్త్వసారమువలన నాతనికి వేదప్రామాణ్యము నందు దృఢవిశ్వాసము కల దనియు, బ్రాహ్మణులయెడ భక్తి గల దనియు స్పష్టపడఁగలదు. ఈగ్రంథమందలి ౧౮, ౧౯, ౨౦, ౨౮, ౩౨, ౩౩, ౪౩, ౪౮, ౬౨, ౬౩, ౬౪, ౭౩, ౧౦౦, ౧౦౧, ౧౧౮-వ సంఖ్యలు గలపద్యములఁ జూడనగును. "భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ" యన్నయర్థ మీశతకమునందుఁ బాగుగఁ గనఁబడుచున్నది. కవి శివభక్తిమహిమయు వర్ణించియున్నాఁడు. వేదముల ప్రామాణ్యము నంగీకరించి యున్నాఁడు. ఇఁక నీతండు లింగైక్యముఁ జెందువఱకును గృహస్థుఁడుగ నుండెనే గాని సన్న్యాసి కాఁ డనినవిషయము పండితారాధ్యచరిత్రమువలననే స్పష్టము. ఈతఁడు వెల్లటూరిలో భార్యాపుత్త్రాదులతోఁ గూడ శివునిలింగమునందుఁ బ్రవేశించె నని పండితారాధ్యచరిత్రము నందునున్నది. కావున నీతఁడు చివరవఱకు గృహస్థధర్మమునే యనుసరించుచుండె ననుట స్పష్టము. ఇంతియకా దీతనికి జుట్టు జందెము తీసి సన్న్యాసియగుట కిష్టము లేకయుండె నని ౪౮-వ పద్యమువలన స్పష్టము. అందు సన్న్యాసులను 'గతశిఖాగాయత్రీయజ్ఞోపవీతనాస్తికులు' అని నిందించియున్నాఁడు.

ఇదియుఁగాక, యీతనితరువాత నీతనిమతమును వ్యాప్తిచేసిన వా రది గృహస్థపీఠమే గాని సన్న్యాసపీఠము కా దనియు, నాపీఠస్థులు పండితునికుమారుఁడైన కేదారయ్యయొక్కయు, శిష్యుఁడైన దోనయ్యయొక్కయు సంతతివా రనియు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. కావున భిక్షావృత్తిమఠ మనఁబడు జంగమమఠమునకును బండితమఠమునకును సంబంధము లేనట్టు స్పష్టపడుచున్నది.

శ్రీశైలముమీఁద ౧౪-వశతాబ్దమునందు భిక్షావృత్తిమఠ మొకటి యుండెనని శాసనములవల్లనను శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము వలనను మన మెఱుఁగుదుము. శ్రీనాథుఁడు తనగ్రంథమును భిక్షావృత్తియతీంద్రుని యనుజ్ఞ ననుసరించి యతనిశిష్యునికంకితముగ వ్రాసెను. ఈకవియే పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగ రచించె నన్నమాట మనము మఱచిపోరాదు. కావునఁ బండితారాధ్యులకును భిక్షావృత్తిమఠమునకును నేవిధమైన సంబంధ మున్నను శ్రీనాథుఁడు తనశివరాత్రిమాహాత్మ్యమునందుఁ జెప్పియుండును. అట్లాతఁడు చెప్పియుండ లేదు.

కొ॥ వేం॥ లక్ష్మణరావు.

శ్రీరస్తు.

# శివతత్త్వసారము.

కందపద్యములు.

---

## ఉపోద్ఘాతము.*

శ్రీపతివాక్పతిముఖ్య[1]మ, హాపురుషులు [2]నెఱుఁగ నోప రతివాఙ్మనస
వ్యాపార మైననీనిజ, రూపము నే నెట్టి దని [3]నిరూపింతు శివా. ౧
[4]ఒందంగ శివునితత్త్వం, [5]బందఁగ విజ్ఞాన మేక మజ మణుచర మా
నందం బనియెడుఁగాని య, నిందితముఁగ నిట్టి దనఁగ నేరవు [6]శ్రుతులున్.
ఇది గా దది గా దనియెడి, మొదలఁ బృథివ్యాదు లయినమూర్తుల నెల్లం
జదువుచు శివు ని న్నె(ఱు)ఁగక, వెదకుచునున్నవి సమస్త [7]వేదాంతములున్.
వా దేమి యనంతా నై, వేదా యనువేదములును [8]వివిధ విధములన్
వాదిసి వెదకెడి నన్నమ, హా [9]దేవా ని న్నెఱుంగ [10]నన్యులతలమే. ౪
నీమూర్త్యాత్ముల నీ పని, ప్రేమముతోఁ గొలుతు రెంత పెద్దలు నీత
త్త్వామేయరూప మె(ఱు)ఁగుట, సామాన్యము [11]గామిఁ జేసి సర్వానందా.
హరిసరసిజభవు లాదిగఁ, బరమమునీంద్రులకు నె(ఱు)ఁగభర మగునీదు
ర్భరభూరిమహిమ వొగడఁగ, నరు లెంతటివా రనాథనాథ మహేశా. ౬
స్తుతి నిజగుణకథనమునకు, నతిశయగుణకథన [12]మందు రన్నిజగుణసం
గతి ము న్నె(ఱు)ఁగక శివ భవ, దతిశయగుణకీర్తి సేయ నలవియె రుద్రా ౭
స్తుతియును నిందయు లోక, త్రితయంబున నీకు [13]లేమి తెల్లం బగుటన్
మతిఁ దమకుఁ గృతార్థత్వ, ప్రతిపత్తికి మిమ్ము జనులు [14]ప్రణుతింతు రజా.
ఓడక నినుఁ బొగడఁగ నా, యీడగుఁ గాదని తలంప కే [15]వేదుఱనై
చూడ వెపొగడెద[16] ననియెద, వేడుక కారణముగాఁగ వె[ఱ]వకరుద్రా.

---

* ఉపోద్ఘాతము మొదలయినశీర్షికలు (headings) మూలమందు లేవు. విషయబోధ సులభముగ నగుటకై యిచే నేర్పఱుపఁబడినవి.

1. ము. 2. నెరఁగ. 3. నిరూపంబు. 4. ఒంద్దంగ్గ శివునితత్వం. అంతటను 'తత్వ' శబ్దమిట్లే ద్విత్వశూన్యముగానున్నది. 5. బంద్దంగ. 6. శ్రుతులునూ. 7. వేదాన్తములూ. 8. యువిధవిదములన్. 9. దేవాయని న్నెరుఁగక. 10. నన్యులంచలమే. 11. గాంగం జేసి. 12. మంద్రుఅన్నిజ. 13. లేమిందెల్లం. 14. బ్రణుతింతు. 15. వేదురనై. 16. ననియెదు.

1*

నే నొకనికృష్టమనుజుఁడ, మానసవచనాతిదూర [1]మహనీయమహ
త్త్వానంద నిన్నుఁ బొగడఁగ, నే నెంతటివాఁడ సురమునీంద్ర వరేణ్యా.
పన్నుగ లజ్జింపక శివ, ని న్నేఁ బొగడెద ననంగ నేర్తునె దేవా
విన్నపము వినుము సకలజ, గన్నాథ యనాథనాథ కరుణాంబునిధీ. ౧౧
దురితహర మనియు శుభములు, దొరకొను ననియును దలంచి దురితారి భవ
చ్చరణాబ్జభక్తిలలనా, పరవశభావమున నిన్నుఁ బ్రణుతింతు శివా. ౧౨
గణదేహేంద్రియ [2]నిత్య, స్వతంత్ర సర్వజ్ఞ విమల సర్వగతైకా
ప్రతిమసదానందాత్మక, మతిసూక్ష్మము నీస్వరూప మతిలోక శివా. ౧౩
సర్వేశ్వర షట్త్రింశ, త్పర్వోపరిగతజగత్ప్రభవహేతుజగ
న్నిర్వాణసోమరూప మ, ఖర్వమహత్త్వంబుఁ బొగడఁ గడు నరిది శివా.
సరసిజభవసరసిరుహా, దరులకు నటమీఁదిమూఁడు దా [3]నధికము ము
వ్వురు నియమకారు లవ్వా, రరిదిజగత్కర్త లాఘ్యు లతి [4]మహిము లజా.
శ్రీమత్సదాశివేశ్వర, నామ భవద్ధామముల మనంబునఁ దలఁపం
గా మ(ఱి) వాక్కునఁ [5]బొగడం, గా మా కలవియె సమస్తకామాతీతా.
సర్వేశ్వర కావున భవ, దర్వాచీనస్వరూపుఁ డనఁదగు[శ్రీ]మ
త్పర్వతపుత్రీపతి మ, ద్గీర్విభవము శక్తి[కొలఁదిఁ] గీర్తింతు శివా. ౧౭
జయ మగు వేదంబులకును, జయ మగుఁ బంచాక్షరికిని జయమగు నిటలా
శ్రయ మగుభసితంబునకును, జయమగు మాహేశ్వరులకు సంతతము శివా.
జయ మగు శివమార్గమునకు, జయ మగు శివసంహితలకు జయమగుఁ గ్రీడా
మయు లగుప్రమథగణములకు, జయమగు వేదాదిధర్మచరితులకు శివా. ౧౯
శివ మగు ధార్మికనృపులకు, శివ మగు గోబ్రాహ్మణులకు శివమగు మఱియున్
శివనిందావిరహితు లగు, భువనత్రయజనుల కెల్లఁ బుణ్యంబు హరా. ౨౦



## పశుపాశపతిజ్ఞానము

జ్ఞానము పశుపాశపతి, జ్ఞానమ [6]యని యల్లె(ఱు)ంగఁ జాలనిజడు ల
జ్ఞానులు వారల తత్త్వ, జ్ఞానము లజ్ఞానములు విచారింప శివా. ౨౧
పతి రుద్రుఁడు పశువుల కని, శ్రుతి చెప్పుచుననికిఁ జేసి రుద్రుఁడు పతి త
క్కితరులు పశువులు పొమ్మని, మతిలో నె(ఱి)ఁగితి శ్రుతిప్రమాణమున శివా.

1. మహనీయ్యమహత్వా. 2. నిత్యా. 3. నధికములు. 4. మహాను. 5. బొగడఁగ మాకలవియె. 6. యుని.

పూని యతద్గుణసంవి, జ్ఞానబహువ్రీహి మాన్పఁ జనుదెంచిన [1]యణ్
మానితషష్ఠీతత్పురు, షానూనసమాస మెఱుఁగ రజ్ఞులు రుద్రా. ౨౩

జీవు లనేకులు పశువులు, భావింపఁగఁ బ్రకృతివికృతిబంధము పాశం
[2]బావృతము లనం బశువులు, నీ వారెంటికిని బతివి [3]నిరుపమ మహిమా.

పశుపతియ పాశములఁ దన, పశువులకును బంధమోక్షపద్ధతి సేయం
గుశలుఁడు గాకవి యొరులకు, [4]వశవర్తులె నేర్పుగలదె వారికి రుద్రా.

పశువులఁట జీవరాసులు, పశుపాశంబులకు నీ[వ]పతివఁట శివ నీ
వ శరణ్య మనం బశుదు, ర్వశభవపాశములు తెగకవచ్చునె యెందున్. ౨౬.

బ్రహ్మోక్తసమస్తహరి, బ్రహ్మాదిపిపీలికాంతపశువుల కెల్లన్
బ్రహ్మోపేంద్ర[య]శోహర, బ్రహ్మేశ్వర రుద్ర నీవ [5]పతి పతిలోకా. ౨౭

వేదోక్తమార్గమున న, త్యాదరము[న] నిన్నుఁ గొలిచి యప్పశువులు నీ
చే [6]దేహపాశబంధ, చ్ఛేదంబున ముక్తు లగుట సిద్ధము రుద్రా. ౨౮

గోపతికృతమున భవపా, శాపేతము లైనపశువులట్ల భవ[త్]పా
శాపేతు లైనపశువులు, ప్రాపింతురు మోక్షసుఖము పశుపతి నీచేన్. ౨౯

త్రిమలకృతదుఃఖసంసా, రమహాబ్ధినిమగ్నజీవరాసులు నీ[7]యు
త్తమకారుణ్యవశంబున, విముక్తులై నీవెపోలె వెలుఁగుదురు శివా. ౩౦



అద్వైతమత ఖండనము

జ్ఞానజ్ఞేయజ్ఞాతృని, దానత్రయమున [8]నబాధితప్రత్యయ మై
నానాగతి ననగత మగుఁ, గాన జగద్భేద మెన్నఁగా సిద్ధ మజా. ౩౧

భేదము దృష్టాదృష్టని, పాదక మై వైదికోక్తపథదర్శనసం
పాదనసమర్థ మగుటను, భేద మదర్శనము ప్రబుతిపిండితము శివా. ౩౨

భేదము సిద్ధంబగుడు వి, భేదకసిద్ధి [9]యగుఁ దద్విభేదకసిద్ధిన్
వేదోక్తకర్మదశలం, బాదర మగుఁ దత్ఫలప్రదారాధ్యగతిన్. ౩౩

ఆరాధ్యుఁ డైనయీశ్వరు, [10]నారాధించుటయ స్వర్గ మపవర్గము ధా
త్రీరాజ్యాదిసుఖంబులు, ఘోరునఁ గర్మానుసూపముల జనుల కగున్. ౩౪

---

1. యన్. 2. బావృతునంబశువుతు. 3. నిరుపమహేశా. 4. పశువర్తులె. 5. పశుపతిలోకా. 6. దేహపాశబంధచ్ఛేదంబవముముక్తులగుట. 7. వుత్తమ. 8. సబాధిత. 9. యగుడు. 10. నారాధించుటయయు.

ప్రత్యక్షజగద్భేదము, సత్యంబై తోఁచుచుండు శబ్దంబునఁ ద
త్ప్రత్యక్షబాధ యగు నని, యత్యనుచితవృత్తి నడుతు రద్వైతు లజా. ౩౫
అమరంగఁ బ్రపంచ[1]మిథ్యా, త్వను చెప్పెడువాది మున్ను దానికి సద్భా
వము దా నెఱుఁగక [2]మిథ్యా, త్వ మనాశ్రయ మెట్లు జెప్పఁదలపోయు శివా.
మానముచేత గృహీతము, గాని [3]ప్రపంచ మ్మె(ఱు)ంగఁ గడుదుర్ఘట మా
[4]మానగృహీతము తథ్యము, తా నెన్నఁడు మిథ్యగాదు తలపోయ శివా.
[5]ఉత్తరశుక్తిజ్ఞానని, వృత్తం బగుశుక్తిరజతవేదనముక్రియన్
వృత్తజగద్భేదము చెడు, న త్తఱి నద్వైతు లెన్న రండ్రు మహేశా. ౩౮
నిర్వచనీయము లేక య, నిర్వచనీయంబు గలదె నిర్వచనీయా
నిర్వచనీయోక్తి న, సర్వాద్వైతంబు చెడదె సర్వానందా. ౩౯
జీవుఁడు శివుఁ డనువాక్యము, భావింపఁగ నైక్యమునకుఁ బ్రతిపాదకమే
జీవుఁడు నీపశుభృత్యుఁడు, గావున నీవాఁడ వేఱు గాదనుట శివా. ౪౦
జీవునకు బంధమోక్షద, శావస్థలు గలవు నీకు నవి లేవగుటన్
జీవునకు నీకు నైక్యము, భావించుట ముఖ్యవృత్తి [6]బాధకము శివా. ౪౧
పరమేశ్వర నీకును మ(ఱి), పరమక్లేశాత్ము లైనపశుజీవుల కం
తరము మహాధాత్రీధర, పరమాణుల[య]ంతరంబు భావింప శివా. ౪౨
ఆత్మ నిరాకారుం డని, యాత్మన మ(ఱి) వెండి జగదుపాదానముగా
నాత్మీయబుద్ధిఁ జెప్పెడి, [7]యాత్మాద్వైతులు విమోహితాత్ములు రుద్రా.
మాతయు మానము మేయము, భాతిగ మిథ్యయని పల్కు [8]పాతకు లాత్మా
ద్వైతులు ప్రమాణశూన్యులు, నీతి మె(ఱు)ంగుదు రె తత్త్వనిర్ణయము శివా.
తనకంటె వే(ఱె) యీశ్వరుఁ, డన లేఁడని పలుకునట్టియద్వైతవిమూ
ఢునకు[ను] లోకాయతునకు, వినఁగా భేదమ్ము గలదె విష్ణువరేణ్యా. ౪౫
ఏన పరమేశ్వరుఁడ న, జ్ఞానంబున నిన్ను నెఱుఁగఁజాలన యనువి
జ్ఞానవిహీనాత్ముల[చెడు], పానలు వోవిడిచి నిన్నె [9]భజియింతు శివా. ౪౬
జ్ఞానస్వరూపుఁ డీశ్వరుఁ, డేని వితర్కింప నట్టియీశ్వరునకు న
జ్ఞానము దొరకొన దని తా, ర్కాణం [బది] యేల సేయ రద్వైతు లజా.
తా రద్వైతులు సచ్చి, త్కారణసర్వజ్ఞసర్వగతనిత్యనిరా
కారుఁ డని చెప్పి వెండి య, కారణమ యవిద్య నీకుఁ గల్పింతు రజా.

1. మిథ్యాత్వము. 2. మిథ్యాత్వ. 3. ప్రపంచ మెఱుంగగడుదుర్ఘటమగు. 4. మానహిత ముతము. 5. ఉత్తను. 6. పాతకము. 7. నాత్మాద్వైతమతులు. 8. పాచకులు. 9. భజింతు.

కల దననోపక లేదని, పలుకఁగనేరకయు మూకబధిరులక్రియ ని
ష్ముల నద్వైతులు తమలో, షల [1]వగతురు భువనభిన్నభానమున శివా.

ఆరాధ్యుం డారాధకుఁ, డారాధక మనఁగ లేనియద్వైతదురా
చారకృతసర్వశూన్యా, కారస్థితి నేమి సేయఁగావచ్చు శివా. ౧౦

పాతకము సకలనాస్తిక, జాతనివాసంబు సర్వసంకర మాత్మా
ద్వైతం బనఁగా జగదు, త్పాతము దొరకొనునె యిట్లు [2]పరమానందా.

నిత్యమహాజనదూష్యము, ప్రత్యక్షాదిప్రమాణబాధాబాహ్యం
బత్యనుచిత మద్వైతము, కృత్యాకృత్యాదిశూన్యకీటకము శివా. ౧౨

[3]అద్వైతమ్ము పురాతన, విద్వన్మునివరుల కెల్ల విద్విష్టము సా
క్షాద్వేదోక్తము గామిని, [4]సద్విద్యద్వైతులకు నసహ్యంబు శివా. ౧౩

ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో, కజ్ఞులు చేకొంద్రె [5]గతశిఖాగాయత్రీ
యజ్ఞోపవీతనాస్తికు, లజ్ఞులు చేకొంద్రుగాక [6]యద్వైత మజా. ౧౪

స్వేచ్ఛాచారులు మిథ్యా, విచ్ఛేదన వేదశాస్త్రవిప్లవవాదుల్
ప్రచ్ఛన్నదోషు లజ్ఞా, నాచ్ఛాదితదుష్టచిత్తు లద్వైతు లజా. ౧౫

కమలాక్షకమలగర్భ, ప్రముఖాఖిలసురులు మునులుఁ బాశుపతులు భ
స్మమయాంగజటారుద్రా, క్ష[7]మాలికాధరుల కాని కా రద్వైతుల్. ౧౬

[8]పాతకయథేష్టదుష్ట, వ్రాతజగద్విప్రలంభ వాదమ కా క
ద్వైతము శిష్టవ్రాతగృ, హీత[మె] కలికాలకలుష హేతువ కాదే. ౧౭

ము న్నద్వైతవ్యామో, హోన్నతి[ని] సనత్కుమారుఁ డుష్ట్రం బయ్యెన్
మన్నింపక ధూర్జటి నని, [9]యెన్న న్వినరయ్య నందికేశ్వరుచేతన్. ౧౮

ప్రీతిం దన [10]కూఁతున క, ద్వైతమహామోహయుక్తి వన[జ]జుఁ డలికా
మాతురుఁడై త్రెళ్లఁడె వి, ఖ్యాతమృగవ్యాధరుద్రకరశరనిహతిన్. ౧౯

వెండియు నభేదమతిఁ [11]గన, కాండజుఁ డీశ్వరుఁడ నేన యనవుడు సద్యః
ఖండితపంచమశిరమును, [12]రుండంబుగఁ జేసెఁ గాలరుద్రుం డతనిన్. ౨౦

ముందటిజలజాసనత, న్నందనులన చెప్పనేల నాస్తిక్యముమై
నెంద(ఱు) సెడ రద్వైతులు, గొందలమున దుష్ప్రబోధకుల్సితవృత్తిన్. ౨౧

1. వగుతురు. 2. సర్వానందా. 3. అద్వైతము. 4. సద్వేదియద్వైతులకు. 5. గతిశిఖా. 6. యద్వైతులజా. 7. మాలికాధరులటనాద్వైతుల్. 8. పాతకయథేష్ట. 9. యెన్నం వినరయ్య. 10. కూంతునకుందైతమోహాహోక్తి. 11. గనకాండజుఁడీశ్వరుండఁన. 12. బుుండంబు.

నీవైశ్వర్యాద్వైతమ, నీయద్వైతమని దుర్వినీతులు కొందఱ్
పాయక వేదాంతాభి, ప్రాయము(ం) గడు(ం) దప్పు(ం)జెప్పి పఱియింతు రజా.
సర్వము నీ [1]యాధీనము, సర్వేశ్వర కాన గుణవిచారితవృత్తిన్
సర్వంబు నీవ యనుశ్రుతి, నిర్వాహము(ం) బొందనేర్చు నిత్యానందా. ౧౩
[2]అద్వైతైకస్థితి నీ, యద్వైతమ కాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైత మనఁగ వే(ఱు) జ, గద్విపరీతమగు[తత్త్వ]గతి గలదె శివా. ౧౪
ఇది గాదని శ్రుతి చెప్పిన, నది బ్రహ్మ(ఱ) నీస్వరూప మని చెప్పెడిదు
ర్మదు లగుమాయావాదుల, చదువులు వోవిడిచి నిన్నె చదివెద రుద్రా.
మాయావాదులముంద(ఱ), మాయావాదులకె వారిమార్గము [3]గీడి
స్సీ యని యొల్లక రోసి శి, వాయనమో [4]యనుచు నిన్నె వలగొందు శివా.


జగత్కర్తృత్వ విచారము

ఏ [5]నిశ్చయపరుఁడను నీ, శానుఁడు నాస్వామి యనుచు సంతతము[ను] [6]సం
త్రాణగతి స్వామిభృత్య, జ్ఞానంబున నిన్నె కొల్తు సర్వానందా. ౧౮
క్షణిక మచేతన మది ని[7], ర్గుణము జగత్కార్యకరణకుశ[లం] బగునే
గణనాతీతమహాగుణ, గణకృత్యవిహీన మైనకర్మము గలదే. ౧౯
పరికింప నచేతనములు, పరమేశ్వర మ(ఱి)ప్రధానపరమాణ్వాదుల్
పురుషుఁడు [8]చేతనుఁ డయ్యును, గర మజ్ఞుఁడుగాన(ం) గర్త గాఁజాలఁ డజా.
అవయవయుతములు గావున, [9]నవ[ని]ప్రముఖంబు లగుమహాభూతంబుల్
వివిధవితర్కవిచారణ, నవశ్యమును గార్యములు మహామహిమ శివా. ౨౦
శ్రీనాథవంద్య కర్తృవి, హీనంబ య్యున్న కార్య మెందును గలదే
కాన జగత్కార్యమునకు, గానప్రియ నీవ యాదికర్తవు రుద్రా. ౨౧
కర్మ మచి త్తని కర్తయుఁ, గర్మాధీనుఁ డని [10]విడిచి కర్మలమొదలం
గర్మఫలదాయి నిన్ను న, కర్మాధీనస్వతంత్రు(ం) గని కొలుతు శివా. ౨౨
శ్రుతిబాహ్యంబులు గావున, సతతంబును జైనబౌద్ధచార్వాకులదు
ర్మతములు పట్టక పట్టితి, శ్రుతిసారభవన్మతంబు సుమతి మహేశా. ౨౩

---

1. యాధీనము. 2. అద్వైత్యైకస్థితిసదిని. 3. గిడిస్సి. 4. వనుచు. 5. నిశ్చయ పరుండనీచా. 6. సంత్రాన. 7. నీగుణము. 8. సేతనుండు. 9. నవప్రముఖంబు. 10 విడచి.

కమలజకమలోదరరు, ద్ర[1]మహేశ్వర శాంత్యతీతతత్త్వాధిపతీ
ప్రముఖోర్ధ్వబిందునాద, క్రమతత్త్వ నిన్ను[నెట్లు]గని కొల్తు శివా. ౨౪
నె(ఱ)సినగురుప్రసాదము, వ(ఱ)లఁగ జగదేకసకలవల్లభుఁ డాదిం
గ(ఱ)కంఠుఁడ వేల్పని ని, న్నె(ఱ)ఁగితి నీమహిమ[2]యె(ఱు)ఁగ నేమియరుద్రా. 
అండంబులు గావింపను, [3]వెండియు బ్రతికింపఁ జె(ఱు)ప విష్ణ్వాదులు ను
ద్దండితశక్తిసమేతులు, చండీశ్వరవరద నీప్రసాదమున శివా. ౨౬
కీర్తింపఁగ లోకములకు(ఁ), గర్తలు విష్ణ్వాదు[4]లయ్యుఁ గా రాదిమహా
కర్త భవత్ప్రేరితు లై, వర్తిల్లుట గారణముగ వారలు రుద్రా. ౨౭
నారాయణాదుల[5]కుసం, సారిత్వము దెల్ల మెల్లశాస్త్రంబులఁ ద
త్కారణమునఁ దత్కృతము వి, చారింప భవత్కృతంబు సర్వానందా. ౨౮
ఆర్యేశ్వర తమచేసెడి, కార్యములం దెల్లవారుఁ గర్తలు గారే
కార్యకరణత్వమాత్ర న, వార్యజగత్కర్త లనఁగవచ్చునె వారిన్. ౨౯
తన తెగినతలయు [6]మడిసిన, తనయునిఁ బుట్టింపఁ గావఁ దా రోపనియా
వనజాసన కేశవులకు, జననస్థితికర్తృతాదిశక్తులు గలవే. ౩౦


భవాదిశబ్దవివృతి

ప్రవితతషట్త్రింశత్త, త్త్వవితానంబులకు నుద్భవస్థానం బై
నివుడు రజోగుణసంగతి, భవుఁ డనునామంబు నీకుఁ బరఁగు మహేశా. ౩౧
మడియిల్లుతత్త్వముల వెను, బడక నిజజ్ఞాప్రశస్తి భావింపఁగఁ [7]జొ
ప్పుడుసాత్త్వికగుణసంగతి, మృడుఁ డనునామంబు నీకు మేలిల్లు శివా. ౩౨
పరపగుతత్త్వములుఁ జరా, చరవితతులు సంహరింపఁ జాలినయతిభీ
కరతామసగుణసంగతి, హరుఁ డనునామంబు నీకు నమరు మహేశా. ౩౩
పరమస్వతంత్రనిర్మల, పరమానందాత్మ పరమభట్టారక ని
స్తర [ని] స్త్రైగుణ్యమహా, త్తర[8]రూపమ్మున శివాభిధానం బయ్యెన్. ౩౪


జగత్కర్తృలక్షణము

పరమస్వతన్త్రుఁడై య, క్షరుఁడై సర్వజ్ఞుఁడై [9]వికారరహితుఁ డై
కరుణాకరుఁడై స్థిరుఁడై, పరఁప జగత్కర్త యుండవలదె మహేశా. ౩౫
పరివిశ్రుతసచరాచర, భరితానేకాండ మగుప్రపంచంబులకుం
బరమస్వతంత్ర శంకర, కరుణాకర నీవ యాదికర్తవు రుద్రా. ౩౬

1. మేశ్వరశాంతాతీతతత్వాపపతీ. 2. యరుంగ. 3. వెండియుంబ్రతిష్ఠింప. 4. లం ఋయ్యు. 5. కసంసారత్వము. 6. మడసిన. 7. జొబ్బుడు. 8. రూపమున. 9. వికారుండై.

భువనోత్పత్తిస్థితి[1]లయ, వివిధవ్యాపారముఖ్యవిభుఁడవు పశుబం
ధవిమోక్షపటుఁడవు స, ర్వ[2]వరప్రదుఁడవు[ను] నీవ రాజాభరణా. ౮౭

పరమాత్మ పరబ్రహ్మము, పరమేశ్వరుఁ డనఁగ నామపర్యాయంబుల్
హరునికివి మ(తి)[యుఁ] దత్త్వం, తరవాచకములనిపలుకఁ దగదుమహేశా.

పరమాత్మ పరబ్రహ్మము, పరమేశ్వరుఁ డనఁగ హరియు బ్రహ్మయును బరా
పరవిభులు గారు శాస్త్రము, లరయఁగ జీవాత్ములగుట నంద(ఱు) రుద్రా.

పరశబ్దంబున కర్థం, బరయఁగ నుత్కర్ష[3]మందు రయ్యుత్కర్షం
బారులకుఁ గలుగునె శివ నీ, కరణి మహాదేవుఁ డొరుఁడు గలఁడే జగతిన్.

ఖరకరపద్మజరుద్రాం, బుజహోదరముఖ్యదివిజపుంగవసచరా
చరభూతనికరపంచా, వరణంబులు గొల్వ నుండువాఁడవు రుద్రా. ౯౧

ఏమని చెప్పుదు శంకర, నీమహిమాడంబరంబు నిఖిలాజాండ
స్తోమములుఁ బ్రకృతి నీయి, చ్ఛామాత్రన పుట్టునటె యసంఖ్యాతములై.

త్రిమలములును రాగద్వే, షములును [జన్మంబు] గర్మసంస్కారంబుల్
గమనాగమనాదులు నను, సమస్తమును లేవు నీకుఁ జంద్రాభరణా. ౯౩

[4]పలిసదృశాధికతాప, త్రితయగుణత్రితయజన్మమృతిసుఖదుఃఖ
క్షుతమృతబంధ[న]మోక్ష, స్తుతినిందాదులును లేవు ధూర్జటి నీకున్. ౯౪

ఓలిన దేవ యవిద్యా, కాలకళానియతి వికృతికార్యాకార్యా
శీలాబాంధవబాంధవ, మాలాబంధములు లేవు మఱి నీకు శివా. ౯౫

అంచితమతి నెవ్వరు ని, ర్మించిరె గుంచితసురులు నివృత్త్యాదికళా
పంచకసంచిత మైనప్ర, పంచము నీయట్ల రుద్ర పరమానన్దా. ౯౬

[5]వేదాద్యష్టాదశవి, ద్యాదిమహాకర్త నీమహత్త్వము వొగడన్
శ్రీదయితావల్లభవా, ణీదయితావల్లభులు[ను] నేరరు రుద్రా. ౯౭

స్వర్గాపవర్గసుఖము ని, రర్గళసామ్రాజ్యసుఖము నాత్మజవిద్యా
వర్గాదిలోకసుఖములు, భర్గ భవత్పాదభక్తిఫలములు రుద్రా. ౯౮


శివభక్తి వివరణము

ఒక్కం డీశ్వరుఁ డని మది, నిక్కముగా నెఱిఁగి భక్తినిష్ఠావృత్తిన్
ముక్కంటి నిన్నుఁగొలిచినఁ, ద్రిక్కక దొ(ర)కవె సమస్తదివ్యసుఖంబుల్.

---

1. విలయ. 2. వరప్రసుఁడవు. 3. మందురయ్యుత్కర్ష. 4. పలిసదృశాదిక.
5. వేదాష్టా.

భక్తి నిను( గొలువవలయును, భక్తియు ధర్మమున( గాని ప్రభవింప దతి
వ్యక్తముగ [1]ధర్మువు వే, దోక్తముగ [2]నెఱుంగవలయుఁ దుదిని మహేశా.
వేదోక్తసదాచారా, పాదనమున నెగడునట్టిపశువులకుఁ బురా
పాదితదురితక్షయ మై, యాదరమున ధర్మ మధిక మగు నీశానా. ౧౦౧
ధర్మాధిక్యంబున నలి, నిర్మలబోధయు విరక్తినిష్ఠయు(ఁ) గలయ[3]
క్కర్మలకు నీప్రసాదము, పేర్మిని శివభక్తి పుట్టుఁ బృథుభావమునన్. ౧౦౨
శివభక్తి సకలధర్మ, ప్రవరమహాధర్మమగుటఁ బరికింపఁగ భా
గ్యవిహీను లగు[దు]రాత్ముల, కవశ్యమును సంభవింప దతిలోక శివా.౧౦౩
మానితశివభక్తి [4]శివ, జ్ఞానధ్యానముల నీప్రసాదాతిశయా
నూనతఁ గర్మక్షయ మై, యానందప్రాప్తి ముక్తిఁ దగు మను[జు]ఁ డజా.౧౦౪
నరసుర[5]తిర్యక్సచరా, చరజీవుల కెల్ల భక్తిసంభావన నీ
కరుణ ప్రధానము ముక్తికి, [6]వరుసన యన లేదు భావ[7]వశ్యుఁడ వగుటన్.
నరకస్థులు స్వర్గస్థులు, నర[8]తిర్యగ్గర్భయావనస్థాదిపశూ
త్కరములు భవత్ప్రసాద, స్ఫురణము [9]దొరకొనుడు ముక్తిఁ బొందుదురు శివా.
అరుదుగ భవత్ప్రసాదము, దొరకొను శివభక్తి(ఁ) గాన దుస్తరభవని
ష్ఠురదుఃఖసముద్ర[స]ము, త్తరణవహిత్రంబు భక్తి [10]దా నయ్యె శివా.౧౦౬
నియత మగుసకలపుణ్య, క్రియ లెల్లను భావశుద్ధికిని హేతువు ల
క్షయభాతి భావశుద్ధియుఁ, గ్రియగొన నీపాదభక్తికిని హేతు వజా. ౧౦౭
అతిగుహ్యంబులకంటెను, నతిగుహ్యతరంబు శివునియందులభక్తి [ప్రీతిన్.
స్థితి యని [11]మోక్షార్థులు దృఢ, మతిఁ గొలుతురు దేవ నిన్ను మనుజులు
జలజాసనాచ్యుతాద్యమ, రులకును [నిదియిట్టి దని]నిరూపింప[ఁగ]న
గ్గల మగునీనిజరూపము(ఁ), దొలఁగక నీభక్తు లె(ఱు)ఁగుదురు సర్వజ్ఞా.౧౧౦
వసుమతి(ఁ) జిత్రము జితచి, త్తసంభవా''నకర్మణా నతపసా నజపై
ర్నసమాధిభి''[12]రవ్యయ నీ, యసదృశభక్తికినిఁ బ్రియుఁడ వగు దీశానా.౧౧౧
వేమేమి [13]తోడఁ బలుకుదు, పాయక నినుఁ గొలుచునచలభక్తునిఁ గని [14]య
య్యా యని పిలిచిననంబికి, నో యని మొలఁగీవె తొల్లి యురగాభరణా.

---

1. ధర్మువున. 2. నెఱంగ. 3. యక్కర్మలునీకుంబ్రసాదము. 4. శివాధ్యానజ్ఞానముల నీప్రసాదితిశయానూనంతర్మక్షయమై. 5. తిర్యక్త. 6 వరుసనయెన. 7. వస్యుండ్డవగు. 8. తిర్యగ. 9. దొరకొనుండు. 10. దానయ్యె. 11. మోక్షార్థుల. 12. రన్యయ. 13. దోడ. 14. యాయ్యాయని......యలఁగీవె.

శివభక్తి లేక చేసిన, వివిధాధ్వరముఖ్యసకలవేద[1]పురాణా
దివిహితకర్మవితానము, లవి యెల్లను నిష్ఫలంబు లగు నీశానా. ౧౧౩
భక్తియ [2]ముక్తి తెరువు వి, ధ్యుక్తముగ నమేయ[3]ప్రియచతుర్వేదా "మ
ద్భక్తశ్చ శుచిః"యను నా, సూక్తి ప్రధానమ్ముగాఁ బఠనోత్తముల కజా. ౧౧౪



## భక్తుల మహిమ.

కొనునది [4]భక్తునిచేతన, ధన మతనిక యిచ్చునదియు [5]"తస్మై దేయం"
బనియును, "తస్మాద్గ్రాహ్యం", బనియును గల దనిరి వేదభక్తివిధిజ్ఞుల్.
కథ లేటికి "సచపూజ్యో, యథాహ్యహ"[6]మ్మనినవిధి యథార్థముగా మ
న్మథమర్దన నీభక్తులఁ, బ్రథితంబుగ నీవ కాఁగ భావింతు శివా. ౧౧౬
అతిమూఢుం డతిపతితుఁడు, నతి[7]దుర్జనుఁ డనఁగవలవ దతిశయభక్తి
స్థితి నెగడు నేని నాతం, డతిపండితుఁ డతిపవిత్రుఁ డతిసుజనుఁ డజా. ౧౧౭
అనయము [8]రుద్రాక్షవిభూ, తినియుక్తుల యింట్ల దిక్కు చెనఁబోవకుఁడో
యని చాటించునుఁ గాలుఁడు, తనపురి శివశాసనుండు ధన్యుం డగుటన్.
ఒండేమి భక్తిసంగతి(ఁ), జండాలుండైన భూతిశాసనధరుఁ డై
యుండినఁ బూజ్యుఁడె యతనిన్, బండనఁగాఁ జనదు భక్తియోగమున శివా.
విను పరుసవేది సోఁకిన, యినుము క్రియ న్నిన్నుఁ గొలిచి [9]యెవ్వం డైనం [టన్.
ద్రినయన యుత్తముఁ డనఁబడు(ఁ), [10]బొనరఁగ శివభక్తుఁ డగ్రపూజ్యుం డగు
అవిచారంబున నెప్పుడు, శివశాసనపూజనంబు సేయఁగవలయున్
శివభక్తులఁ గని జాత్యా, ది[11]విచారము విడువవలయు దృఢభక్తిమెయిన్.
తెవులు[ను] [12]లేమియు భయమును, శివభక్తుల కైన యెడలఁ జేకొని రక్షిం
పవలయుఁ బ్రియములు సేయఁగ, నవశ్యము[నువలయు] వారి కాత్మవిధమునన్.
శివశాసనపూజనమున, శివుఁ డెంతయుఁ బ్రీతుఁ డగుట(ఁ) జేసి శివప్రీ
తివిధానము గారణముగ, శివశాసనపూజనంబు సేయఁగవలయున్. ౧౨౩
శివలాంఛనధరుఁ డగుమా, నవుఁ గనుఁగొని మునిఁగి లేచినవిధమునం జి
త్తవికాస మెసఁగ సత్క్రియ, లవశ్యమునుఁ జేయవలయు నతిలోక శివా. ౧౨౪
శివశాసనుఁ డగురుద్రా, క్షవిభూతిదృఢాంగుఁ జూచి సన్మతి సాక్షా
చ్ఛివుఁ డనునదియ విచారము, [13]శివునాజ్ఞయు నగుట శాస్త్రసిద్ధంబగుటన్.

---

1. పురాణోక్తవిహిత. 2. ముక్తికిం దెరువు. 3. ప్రియచతుర్వేదమద్భక్తశ్చశచోయనిన సూక్తిం బ్రధానముగ. 4. భక్తిని. 5. తస్మైదేహంబనియుదరోగ్రాహ్యం. 6. హంబనియనిన. 7. దుర్జయుండు. 8. రుద్రాక్షా. 9. యవ్వండైనన్. 10. నొనరంగ. 11. విచారములు. 12. లేమిని. 13. సివాజ్ఞాయనుట.

కులవిద్యాచారాదులు, దలఁపక నీవలనిభక్తితాత్పర్య మెసం
గలమానవుఁడు సమస్తముఁ, గలవాఁ డనిపూజ సేయఁగావలయు శివా.

ధరణిఁ గులరూపవిద్యల(ఁ), బర(ఁ)గి భవద్భక్తి లేనిపాలసుఁడు గడుం
బరిమళము లేనికుసుమము,గర మొప్పనిభంగి(ఁ)గొ(ఱ)యుఁగాఁడుమహేశా.

ధర నెట్టివాని కనిమొన, బియదునక జయంబుగాక పి(ఱి)ఁదికిఁ గలదే
హర నీభక్తిని దుస్తర, [1]దురితంబులు దొలఁగుఁగాక తొలఁగునె [2]యొంటన్.

జాత్యాదిసూతకంబులు, హత్యాదిసమస్తపాతకాదులు శివ నీ
భృత్యులఁ బొందునె జలములు, నిత్యస్థితిఁ బొందనేర్చునే జలజములన్.

ఎట్టికడుఁగీడుఁగులమునఁ, బుట్టియు శివ నిన్నుఁ గొలిచి పూజ్యుఁడ మనుజుం
డట్టిన ధర్మవు (రొ)ంపిం, బుట్టియుఁ బద్మంబు సాలఁ బూజ్యమ కాదే. ౧౩౦

నీనిజభక్తుం డంత్యజుఁ, డైనఁ బవిత్రుండు పూజ కర్హుఁడు జగతిన్
[3]"తేనసహ సంవసే" త్తని, గానప్రియ శ్రుతులు [4]మ్రొయుఁగాన కపర్దీ.

మసికప్పడమునఁ [5]బొదివిన, యసదృశమాణిక్య[6]మెట్టు లట్టుల దుర్జా
తిసమావృతుఁ డయ్యును నీ, కు సదాభక్తుఁ డగుమనుజకుంజరుఁడు శివా.

కులవిద్యాచారాదులు, గలవాఁడే శివునిభక్తిఁ గలవాఁ డైనన్
వెల గలదె పసిఁడి గమ్మగ, వలచినవిధమున సమస్తవరదాత శివా. ౧౩౩

కులజ[7]కులహీను లిద్ద(ఱు), నెలకొని భవదచలభక్తినిష్ఠావృత్తిన్
వెలసినమీ(ఁ)ద సమానుల, కులజులుఁగులహీనులనఁగ(ఁ)గూడదువారిన్.

ముందటిపసిఁడిన పోలును, సుందరముగఁ బరుసవేది సోఁకినయినను మా
నందస్వరూప శివ నినుఁ, జెందినదుర్జాతిఁ దొంటిశ్రేష్ఠమ పోలున్. ౧౩౫

జనపతిశాసనధరులం, గని భయమునఁ గులము రోయకయు సత్క్రియలం
దనుపుక్రియ నిర్విచారం, బున నీశాసనము వలయుఁ బూజింప శివా.

గుణవత్పాత్రులఁ బూజిం, చినశాసనపూజఫలము [8]సేకుఱ దని శా
సనపూజ నిర్విచారం, బునఁ గావింతురు భవత్ప్రభూతాజ్ఞ శివా. ౧౩౭

శివభక్త[9]ల నావా రే, శివభక్తులవాఁడ ననుచు(ఁ) జిత్తానందో
త్సవగతి నెగడెడుమనుజుఁడు, శివ నీవాఁ డొరుఁడు గాఁడు జితసంసారా.

---

1. దురితంబులుంతు. 2. యొంటన్. 3. దేనసహంసవసేత్తని. 4. మోయఁగాన
5. బొడవిన. 6. మెట్లట్ల. 7. కులహీనను. 8. సేకూఱ. 9. శివభక్తులనువారే.

భక్తుల ప్రసాదమెప్పుడు, భక్తుల నా కేడుగడయు భక్తుల గతి యే
భక్తుల[1]వరవుడ[న]ని శివ, భక్తులఁ గొనియాడవలయు భక్తులకు శివా.
భక్తుల దవ్వులఁ గని శివ, భక్తులు వచ్చి రని పొంగి [2]బ్రతికితి నని పో
భక్తుల కెదురేగి యథా, శక్తిస్థితిఁ జేయవలయు సత్క్రియలు శివా. ౧౪౦
భక్తుఁడు లోకహితార్థుఁడు, భక్తహితార్థుఁడు శివుండు భావింపఁగనీ
యుక్తి [3]యథార్థ మ్మని నీ, భక్తులఁ బూజింపవలయు భక్తులకు శివా. ౧౪౧
లోకానుసారికిని శివ, లోకము దొరకొనదు గాన లోకము నెమ్మిం
జేకొన[క] విడిచి శివ నీ, లోకము గావలయు భక్తిలోలుఁడు రుద్రా. ౧౪౨
లోకము విడువనివానిని, లోకము విడువద[ని] విశ్వలోకేశ్వర నీ
లోకముఁ గోరెడుమనుజుఁడు, లోకము వోవిడుచు నీవ లోకముగ శివా.
గురుఁ డాదిఁ దనకుఁ గఱపిన, నెరవునఁ జని మీ(ఁ)ద భక్తివేదించిన స
ద్గురువు తము గడచి [4]చేసిన, పరవశుఁడై మఱవవలయు భక్తుం డస్సురా.
హర[నీభక్తి][5]నిషేధక, చరితలు వోవిడిచి నిన్నె చనఁ గొలిచి నిరం
తరభక్తుఁడై శివైక్యుఁడు, [6]నిరాణ యగుపసిఁడివోలె [7]నిలువఁగవలయురా.
కలనైన నొండు దైవము, గల దనియెడుపలుకు దక్కి కలఁ డొక్కఁడ కే
వలశివుఁడె దైవ మని ని, శ్చలభక్తి శివైక్యుఁ డుండు సంతతము శివా.
పరువడిన«యో౽నన్యదైన, స్మరణసకృ» త్తనఁగ నన్యసంస్మరణము[నం]
దిరువదియెనిమిది[8]కోటులు, నరకంబులఁ బొం దనాథనాథ మహేశా. ౧౪౭
[9]కర్త య[ని] నిన్ను నె(ఱ)ఁగినఁ, గీర్తింపఁడు వెండి తన్నుఁ గార్యాకార్యా
వర్తనలఁ గర్త నే నని, కర్త ప్రధానుండు గాన ఘనభక్తుఁ డజా. ౧౪౮
వ్యక్తముగ లింగతనుఁ డను, యుక్తి యె(ఱు)ఁగుటకుఁ జాల నుత్కృష్టమగురా
భక్తైకతనుఁడు శివుఁ డను, యుక్తియె(ఱు)ఁగుట సమస్తయోగానందా. ౧౪౯
భక్తి కనుదేహభావ, వ్యక్తుఁడ వని నిన్ను నమ్మి వదలక భక్తిన్
భక్తులు నీ వని కొలిచిన, భుక్తియు ముక్తియునుఁ బడయఁబోలు మహేశా.
శివుఁడు పరిపూర్ణుఁ డని మది, శివభక్తులఁ జూచి యతివిశేషప్రీతిన్
వివిధసపర్యలఁ దనిపిన, నవశ్య[మును]దానఁ బ్రీతి యగు నీకు శివా. ౧౫౧.

---

1. వరవుండ. 2. బ్రతికితిననిపోశివ. 3. యదార్థమని. 4. చేసెనని. 5. నిషేధకాకి. 6. కన్నడమున, నిరాళ = స్వచ్ఛమైన, అని యర్థము. 7. నిలుపంగ. 8. గొట్లు. 9. కర్తయునిన్ను.

నిన్నుఁ గని తన్ను జగమును, బన్నుగ మఱవంగవలయు భక్తునిఁ గని యా
నిన్నును మఱవఁగవలయు జ, గన్నుత భక్తుండు నీవకా(ఁ) దెలిసి శివా.
జంగమలింగం బగుభ, క్తుం గని పూజింపఁడేని గోటివిధములన్
లింగార్చన చేసిన వృథ, జంగమ [1]ముత్తమము గాఁగ స్థావరమునకున్.
చూడఁగ శివభక్తునిఁ గని. వేడుకఁ గొనియాడఁడేని వృథ యాతనిమి
థ్యాడంబర[2] దేవార్చన, యోడునఁ బోసినజలంబుయుక్తి మహేశా. ౧౫౪
శివభక్తులఁ బూజింపక, శివపూజలు గోటివిధులఁ జేసిన వృథ యా
శివభక్తులఁ బూజింపుట, శివ[3]పూజలఁ గోటివిధులఁ జేయుట రుద్రా.
క్రియగొన జంగమలింగము, నియతిం బూజింపఁడేని నిష్ఫలములు స
త్క్రియలునుఁ బూజలు“లింగ, ద్వయంసమఖ్యాత”మనినవాక్యముపొంయున్
ఇంటికి భక్తులు వచ్చిన(ఁ), గంటిమి మంటి మని వారి కాళ్లు(ం)గడుగన్
మంటఁ గని సీతువాసిన, కంటెను దురితములు వాయు గరకంఠ శివా.
రుద్రాక్షభూతిభూషణ, ముద్రాంకితు నెదురు గన్న ముదమున సాక్షా
ద్రుద్రుఁ డని తలఁపఁడేని శి, [4]వద్రోహుఁడు నరకగామి యగునుమహేశా.
హరిపద్మజవాసవవి, స్తరవిభవములునుఁ దృణీకృతము లనిన మహే
శ్వర నీదృఢభక్తులకును, సురనరవిభవంబు లెంతచోద్యములు శివా. ౧౫౮
[5]అనమాణిమాదిగుణరస, [6]రసాయనమ్ములును నిఖలరాజితరాజ్యా
దిసుఖంబులు శివసుఖమున, కసమానము లండ్రు నీశివైక్యులు రుద్రా.
ఆకాశము వొడగొగసిన, భూకంపంబైనఁ బంచభూతప్రళయ
వ్యాకులమైన[ను] మఱచి శి, వైక్యుఁడు[7] నిను విడిచి యొండు లాలింపఁడజా.
కులగిరులు [8]జిట్టఁ దిరిగిన, జలరాసులు మేరదప్పి చనుదెంచిన నీ
వల నె(ఱి)ఁగినదృఢభక్తుఁడు, చలియింపఁ డపారఘోర[9]సంసార[మునన్.]
దిక్కులు వీడ్వడి కలసిన, దిక్కరులు మదంబు డిగ్గి తిరిగిన మఱి నీ
దిక్కెఱిఁగినదృఢభక్తుఁడు, వక్కం [10]డెవ్వరికిఁ గార్యభారమున శివా. ౧౬౩
భూతలముఁ దల్లడిల్లినఁ, బాతాళము బయలుపడ్డ బ్రహ్మప్రళయం
బేతెంచిన నీభక్తుఁడు, చేతులు ద్రిప్పక[యు] పూజసేయును రుద్రా. ౧౬౪

---

1. ముత్తమముం. 2. దనార్చనంయోడనం. 3. పూజలుం. 4. “శివద్రోహుఁడు నరకమందుఁబడును మహేశా.” యని కవిప్రయుక్తమగునేమో! 5. అసమాదిణిమా. 6. రాసాయనములును. 7. నిన్నువిడిచియొండ్లాలింప. 8. ఝిజ్జిందిరిగిన. 9. సంసారి. 10. డెవ్వరికినిం.

వేరేయేటికిఁ బ్రాణంబులు, వోయినఁ దమకే[ల]లుఁ దెగిన భువిభక్తులు ని
న్నాయతమతి [1]నభ్యర్చన, సేయక కుడువరు త్రిలోకసేవితచరణా. ౧౬౫

ఆయుధములుఁ గుసుమము లగు, నాయగ్నులు మెట్ట లగు మహోమవగజముల్
వే యేల [2]గండశిల లగు(ఁ), బాయక నినుఁ గొలుచునచలభక్తులకు శివా.

అధమ[ము న]త్యుత్తమ మగు, నధర్మమును ధర్మమగు[ను] నాగమవిధి స
ద్విధి యగు నిషేధమునుఁ జం, ద్రధరా భవదీయభక్తితాత్పర్యలకున్.

క్షుత్తృష్ణాదివిపత్తులు, [3]బత్తళి జలతపన[శీత]బాధాదులు ను
ద్వృత్తగతిఁ బొంద వెఱచు ను, దాత్తభవద్భక్తియుక్తు లగువారి శివా.

పరపరివారిత్వము ని, ష్కరుణత్వము నిత్యయాచకత్వము నతిని
ష్ఠురకర్తత్వము నెన్నఁడుఁ, బొరయవు నీభక్త[4]వరులఁ బురసంహారా. ౧౬౯

మరణవునగ్భుఁతాదు, శ్చరిత్రతాదుర్ముఖతా . . . .
పరతంత్ర[తా]దు లెన్నఁడుఁ, బొరయవు నీభక్తవరులఁ బురసంహారా. ౧౭౦

కోరరు మ(ఱ)చియు స్వర్గ, స్వారాజ్యప్రముఖనిఖిలసంభూతభవా
పారసుఖంబులు శివరస, భూరిసుఖాను[5]భవభక్తపుంగవులు శివా. ౧౭౧

నీ పనియెఱి(ఁ)గినపిమ్మట, నీవ యె(ఱు)ఁగు దని యుండు నీనిజభక్తుం
డావంతయు నే పనియెడు, భావనఁ గైకొనఁడుఁ గార్యభారమున శివా.

నీ పని యె(ఱి)ఁగినపిమ్మట, సేవలనికి వ్రాలఁ [6]డొండు లెఱుఁగఁడు దనకున్
జీవన మెట్లని తలఁపఁడు, భావనఁ గేవలశివైక్యభక్తుఁడు రుద్రా. ౧౭౩

మును రుద్రుఁడు గానియతం, డనుకీర్తింపండు రుద్రు[7]నర్చన భావ [దార్.
మ్మునఁ దలఁపఁడు సూడఁడు గా, వున శివభక్తుఁ డగుమానవుఁడు రుద్రుఁడు

జగదుపకారార్థముగా, [8]మొగి రుద్రులు రుద్రలోకమునసుండి భువిన్
నెగడి శివభక్తు లనఁగా, నగణితముగ నవతరింతు రం ద్రాదిమునుల్.

మఱిఁ జూడ(ఁ)గ నిర్విధ మీ, ఱిలి నిస్సందిగ్ధ మదియు శివభక్తులు వి
శ్రుతముగ మనుష్యచర్మా, వృతరుద్రుల యగుట(ఁ) దత్త్వవేదులదృష్టిన్.

కావున భక్తులు త్రిజగ, త్పావనులు భవాంధతమసపటలవిఘటనో
ద్భావితనిజమహిమార్కవి, భావసు లవినాశు లతికృపాపరు లెందున్. ౧౭౭

1. కభ్యర్చన. 2, గడశిలలగు. 3. నత్తెరి, ఇటయలితప్పినందునబత్తళి, యనుకన్నడశబ్దము ''నత్తెరి''కి బదులుగాఁ బెట్టఁబడినది. బత్తళి=నగ్నత్వము. 4. చరుల. 5. భవస్ఫక్త.6. డొండ్లె ఱుఁగండు. 7. నర్చింపండుభావమున. 8. నొగి.

మానిసిపైతో ల్గప్పిన, యీనెపమున నున్నరుద్రు లీశ్వరభక్తుల్
మానుసులె వారు లోకహి, తానేకాచారు లీశ్వరాజ్ఞాధారుల్. ౧౭౯

మానుగ నెప్పుడు 'మద్భ, క్తా నవినశ్యంతి' యనఁగఁ దగియుండఁగ నీ
శాన భవత్కారుణ్యాం. భోనిధి [1]ననుఁ దేల్చి ముక్తి (ఁ) బొందింపు శివా.

దేవా నాదుర్గుణములు, భావింపకుమయ్య నీకు భక్తుఁడ 'మద్భ
క్తావిగతకల్మషా' యను, నీవచనము నమ్మినాఁడ నిరుపమమహిమా. ౧౮౦

ప్రణుతింప [2]'నమేభక్తా (ః) ప్రణశ్యంతి' యనఁగఁ దగినపలుకునకుఁ దగన్
గణనాథ భక్తచింతా, మణి రక్షింపవె యపారమహిమాధారా. ౧౮౧

హరిసరసిజాసనాదులు, సరి గా రని చెప్పు [వివిధ] శాస్త్రము లెల్లన్
నరు లీశ్వరభక్తులకును, సరియగుదురె జాతిరూపసామాన్యములన్. ౧౮౨

మండెడుమహాగ్ని [3]నుండెడు, పిండాయస్థిని బినాకిపృథుసన్నిధిమై
నుండెడి శివభక్తులతో, నొండొకదుర్జనుఁజు లెనయె యూహింపంగన్.

మ్రొక్కెడువు లింగమూర్తికిఁ, దక్కటిమూర్తులకు మఱి[యుఁ]దమకలనైనన్
మ్రొక్కెద మని తలఁపరు నర, దిక్కుంజరు [4]లనఁగ నెగడుత్రినయనభక్తుల్.

[5]మడఁతి గొడు కర్థ మిది యని, యెడసేయరు భక్తి నిత్తు [6]రేలినపతికిం
బడయుదురు మగుడ నానిన, మృడుభక్తులు వలచిరేని [7]మెచ్చించి శివున్.

మలహరుఁడు జలకమాడిన, జలములు విషములకు మందు శస్త్రవ్రణసం
కులమునకు [8]దీపతైలము, త్రిలోచను[ని]భక్తులకు [న]తివిచిత్ర మిలన్.

తఱిగిన [9]తలలును నదుకును, మఱి కోసిననాలుకలును మసలక వచ్చుం
గఱకంఠు[ని]భక్తుల కని, యెఱుఁగరె సద్య[ః]ప్రతాపు లీశ్వరభక్తుల్. ౧౮౩

పుచ్చినకన్నులుఁ గ్రమ్మ(ఱ), వచ్చును దేహంబు తోడిసి వ్రస్సిన [10]వుండుం
జెచ్చెరఁ దే(ఱు)ను భక్తుల, కచ్చెరువుగ శివునిమహిమ[నతి]శీఘ్రమునన్.

చేసినసుకృతము గుడుతురు, [11]భాసురముగఁ గర్మ లెల్లఁ బరలోకమునం
జేసి తగఁ గుడుతు రిందుల, నాసకలము నెఱుఁగఁద్రిభువనాధిపుభక్తుల్.

కలఁ డీశ్వరుఁ డనునమ్మిక, కలవాఁడే శివునిభక్తిఁ గలవాఁ డైనన్
మలహరుభక్తులఁ బెద్దలు, కులజులుఁ గులహీను లనఁగ(ఁ)గూడదు వారిన్.

---

1. నన్నుందేల్చి. 2. నమేఃసుభక్తా. 3. నుండెందు. 4. లెనంగ. 5. మడదిగొడుక ర్థము మొదలని. 6. రేతిన. 7. మెచ్చించు. 8. దిపతిలము. 9. తలలునునదుకొను. 10. వుంగునె. 11. భాసురమున.

నియతాత్మ లనియతాత్మలు, నయవినయాన్వితులు నయవినయవర్జితు ల
న్వయజు లనన్వయజులు ని, ర్ణయవిరహితమహిము లఖిలనాయకభక్తుల్.
నీచు లనీచులు పరిమిత, వాచులు వాచాలు రాత్మవశు [1]లవశులు స్వే
ష్టాచారు[లవాఙ్మానస], గోచరచరితులు పినాకికూరిమిభక్తుల్. ౧౯౨
ఆరయఁ [2]బువ్వులకతమున, నారలు దలకెక్కునట్లు నానావిధసం
సారులు శివభక్తిమెయిన్, వారక యెప్పుడుఁ ద్రిలోకవంద్యుల గారే. ౧౯౩
శ్వపచుండైనను శివభ, క్తిపరుం డగు నేని నతఁడ ద్విజవర్యుం డా
శ్వపచునకుఁ గీడు శివభ, క్తిపరాఙ్ముఖుఁ డైనయట్టిద్విజుఁడు మహేశా. ౧౯౪
పలమేఁడుప్రత్తికి నైనను, గుల మమ్ముడువోవునట్లు గులమును బలముం
గలిమియు విద్యయు సర్వము, మలహరుఁ డగుశివునిభక్తిమహిమయ కాదే.
ఇన్వసుమతిఁ గడుఁ గమ్మని, పువ్వులలోఁ బుట్టినట్టి[3]ప్రువ్వులు గొ(ఱ)యే
సర్వజ్ఞ[4]భక్తి విరహితుఁ, డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ [5]డేటికిఁ గొ(ఱ)యే.
క(ఱ)కంఠుభక్తి వెలిగా(ఁ), గొఱ గా వెవ్వియును నవియుఁ గొన్నిటినాళ్లల్
మ(ఱి)పిండకూడు వెట్టిన, మెరయలక్రియ మెరచుమీస మెదుకులమెరవుల్.
భవభావరజోదూషిత, లవుమనుజులబుద్ధివనిత లగణితదినముల్
శివభావపుణ్యజలముల, నవగాహన సేయకున్న నశుచుల కారే. ౧౯౮
పుట్ట నని చచ్చి చా నని, పుట్టెడు [6]ప్రువ్వులువిధమునఁ బురహరుభక్తిన్
ముట్టనిమనుజులు సచ్చుచుఁ, బుట్టుచునుండుదురు [7]ముక్తిపురి కెడ దవుల౯
పూజింపుఁడు పూజింపుఁడు, పూజింపుఁడు శివుని భక్తిఁ బూజింపుఁడు మీ
రోజ సెడి నడవకుండుఁడు, రాజులు రట్టళ్లు నగుట రా వెల్లిటికి౯. ౨౦౦
అవిరలనిష్ఠావృత్తిని, భవదీయార్చనలు సేసి పడయుసుఖంబుల్
సవిశేషభక్తి భక్తుల, [8]దవులంగని మ్రొక్కునతఁడు దానును బడయు౯.
కని మ్రొక్కుఁడుశివభక్తుల(ఁ), గొనియాడుఁడుమీఁదనుగతి(ఁ)[9]గొనవలసిననొ
ల్లనినాఁ డూరకయుండుఁడు, మనుజులు [10]దెగడకుఁడు వారి మంద్రేయేని౯
[11]అనఘులఁ గేవలభక్తులఁ, ననుపక్తిం గని “సుదూరమపిగన్తవ్య”
మ్మన దర్శించిన(ఁ) జాలదె, గొనకొని శివుఁజూడ వే(ఱ) కోరఁగ నేలా.

---

1. లవశులసివిష్టాచారులుగోచరభరితులు. 2. బుద్బుల. 3. పువ్వులు. 4. భక్తివిరహి
తులం డెవ్వండు. 5. డేంటికిం. 6. పువ్వులు. 7. విముక్తిపురికడవులన్. 8. దవ్వులంగని.
9. గనవలసిన. 10. దెగంగడకుండువారి మంద్రేయనిన్. 11. అనఘులం గేవలభక్తులు.

శ్రీలింగదేవుభక్తుల, శీలంబులు మనములోనఁ జింతింపుచుఁ దా
నాలుక కసివోఁ బొగడని, యాలరిజన్మంబు జన్మ మనఁగాఁ దగునే. ౨౦౪
తెగడిన దుర్గతు లగుఁ గడుఁ, బొగడిన సుగతు లగు వారిఁ బురుషోత్తములన్
జగదేకవిభునిభక్తులఁ, బొగడరె కృత[1]మతు లగణ్యపుణ్యోదయులన్. ౨౦౫
శ్రీయునుఁ గులమును శీలము, నాయువు నష్ట మగు[నతి]రయంబున ముక్తి
శ్రీయుక్తుల శివభక్తుల(ఁ), బాయక నిందించునట్టిపాపాత్ములకున్. ౨౦౬
ఏదేశంబున నేపురి, నేదెస వసియించియుండు నిల శివభక్తుం
డాదేశంబున నాపురి, నాదెస వసియించియుండు హరతీర్థంబుల్. ౨౦౭
[2]శివభక్తులయుండెడిచో, టవిముక్తక్షేత్ర[3]మందు రధికప్రీతిన్
శివుఁ డెప్పుడు నుండు జగ, త్పవిత్ర మగు నదియ సర్వపాపహరంబున్.
కడుఁగడి(ఁ)దిపాపము పరు(ం), డొడరిన యొడఁ దలఁచికొనఁగ దుర్బలుఁ డైనన్
మృడుభక్తులయుండ్లకుఁ జని, తడయకకుడిచినను నీళ్లుద్రావినఁ బాయున్.
స్ఫుటశివతాంత్రికుఁ డపగత, కుటిలాత్మకుఁడు ధరియించుగోత్రము నెల్లం
[4]బటుగతిఁ రజ్జుకరూప, ద్ఘటంయథా యనిన సూక్తి గారణ మగుటన్. ౨౧౦
ఓజ సెడినదుచుభక్తుల, నోజకు రాఁ జేయ శివుఁడ యొడయఁడు నిక్కం
బోజ సెడి నడుచుభక్తుల, నోజకు రాఁ జేయు శివుఁడ యొడయఁడు జగతిన్.
[5]భువిఁ బ్రాణపంచమునకు[ను], శివభక్తుఁ డనర్హుఁ డెన్ని చేసిన(ఁ) దప్పుల్
[6]శివసన్నిధి కారణమున, శివశాస్త్రపురాణవచనసిద్ధాంతగతిన్. ౨౧౨
[7]అధికాపరాధకృతమున, [8]నధమాంత్యం డెవ్వఁ డేని నగుశివభక్తుం
డధికబ్రాహ్మణవిధమున, వధకు ననర్హుండు వేదవాదులదృష్టిన్. ౨౧౩
తా రోడకశివ[9]శాసన, కారణమున నెట్టి[10]దైనఁ గడుమాన్యులు ని
స్తారార్థము దమకు శివా, చారస్థితి నడపవలయు శశిధరుభక్తుల్. ౨౧౪
మా [11]కేమి భక్తుల కని, చేకొని శివాజ్ఞ మీ(తి)చెడనడచిన నీ
[12]లోకమున మాన్యు లగుదురు, గా కెక్కు దురయ్య శివునికవిలియనతఁగుల్



## శివనిర్మాల్యము.

చవి కోరగి లోభమున సం, భవింపకయు నన్న మొందుభంగిన యొండెం
బవిలి మలదేహులకు భువి, శివనిర్మాల్యంబు గడునిషిద్ధము గుడువన్. ౨౧౬

1. మతులుయగణ్య. 2. శివభక్తులుయుండెడి. 3. మండధికప్రీతిన్. 4. పటుపలి. 5. భువి బ్రాహ్మణ. 6. శివసన్నిధింగారణము. 7. అధికాపరాధి. 8. అవమాంత్యంబెవ్వం. 9. శాసనమున కారణమున. 10. దైన్యంగడుమాన్యులనిస్తారార్థము. 11. మాకేమి. 12. లోకమునకమాన్య.

ధరణి నభక్తులకు మహేశ్వరనిర్మాల్య[వ]భోగసంస్పర్శనత
ద్ధరణ[1]సమాలోకనపద, పరిలంఘనవిధులనంతపాపముఁ జేయుఁగా. ౨౧౯
క్షితి నాత్మ దేహ మనదూ, పితప్రదేశంబు రోయఁ జెందఁగ నరుఁ డె
ట్లతనికతి[2]రోయు శివుఁడును, మతి నిర్మాల్యంబుఁ గుడుచుటలయుతుఁ[3]జెందఁగా
నిర్మలపదార్థ మగుటను, నిర్మాల్యం బనఁగ నెగడు[నీ]నిర్మాల్యం
బర్మిలి(ఁ) గుడుతురు భక్తులు, కర్మతుయు నగుట మోహ[4]కాంక్షలు దవ్రా.
గురుకృతశివ[5]దీక్షమెయిఁగా, విరహితమల[6]దేహు లగుపవిత్రులు భక్తుల్
హారనిర్మాల్యము గుడుతురు, పరమేశ్వరునందు దాసభావముతోడఁగా. ౨౨౦
భవదోష[7]విఘాతార్థము, శివభక్తుల నియతినిష్ఠఁ [8]జేకొనుభక్తిఁగా
శివనిర్మాల్యము గుడుతురు, శివశాస్త్రపురాణవచనసిద్ధాంతగతిఁగా. ౨౨౧
నిరతిశయ[9]భావనిష్ఠా, పరు లగుభక్తులకు దాసభావమున మహే
శ్వరనిర్మాల్యము గుడుచుట, పరమశివాచారధర్మపథము ధరిత్రిఁగా. ౨౨౨
ఆకునుఁ బువ్వునుఁ గాయయు(ఁ), బ్రాకటముగ నన్నపాన[10]భక్ష్యాపథముల్
శ్రీకంఠున కర్పింపక, చేకొనుటలు మద్యమాంససేవన గాదే. ౨౨౩

శివదీక్షితుఁడు.

స్వార్థపరార్థశివార్చన, మర్థిని శివదీక్షితునకు నగుఁ జేయఁగ న
త్యర్థ[ము] నిరర్థకంబుభ, యార్థంబు నదీక్షితునకు నర్చన మెందుఁగా. ౨౨౪
వినుఁ వేదశాస్త్రములు చదివి, విన మఱియు నదీక్షితునకు విహితము గా దం
ట [11]నదీక్షితున కభక్తుని, కిని శివలింగంబు ముట్టఁ గ్రియగాదు విధిఁగా.
వెలగొని యదీక్షితుఁడు చే, వలమంతనఁ బూజచేసి వర్తించు మెయిఁగా
మలహరుని[12]దీక్షితుఁడు చే, వలకుఁ జెఱుంగంగఁ [జేయు]నలయును దీనిఁగా.
భువి జన్మాంతరసంస్కా-, రవశంబున సహజభక్తిరతి పుట్టి శివుఁగా
ధ్రువముగఁ బూజించు మహా-, త్మువునకునీశ్వరుఁడు గురువు[13]శాంభవదీక్షఁగా.
శివుఁడు [14]గురుండుగ భజన, మ్మవిరతమృగభక్తిఁ జేయునట్టి[15]శివజ్ఞా
నవిదుఁడు [16]దేవలకుఁడు గాఁ, డవు దీక్షితుఁ డుభయమపూజ కర్హుఁడు జగతిఁగా.

---

1. సమాలోకనపదపరిలంఘనవిధులనంత. 2. రోయుండుశివు. 3. జెందుఁగా. 4. కాంక్షలు.
5. దీక్షితిమెయిఁగా. 6. దేహములనుపవిత్రులు. 7. విఘాతార్థము. 8. నెక్కొను. 9. భవతినిష్ఠా.
10. భక్ష్యాపథ. 11. నదీక్షితునకునభక్తునికిశివలింగమంబు. 12. దీక్షితుఁడుండే. 13. శాంభవి.
14. గురుండుగురుండుగశివాభజనమవిరత. 15. శివాజ్ఞానవిధుండు. 16. దేవలకుగురుండుగాఁడు.

క్షితి నేకగురునిచే దీ, క్షితులెల్లను బ్రాతలంత్రు కృతులందును ద
త్పుతు లగుట(ఁ) జేసి తద్దీ, క్షితసుతులకు దీక్షవలయుఁ గృ[తి] రోగ్యతకున్.
జనకాదులు చేసినధ, ర్మనిరూఢత యైనకన్య మానుగ శివభ
క్తున కీ[వ]చ్చు విరోధికిఁ, [1]బన దీయం బడయుభక్తి సన చెడ నుడుగన్.

శివభక్తుఁడుగాని పతి.

శివభక్తుఁడు గాని పతి, శివిరతము బుద్ధి చెప్పనగు శివభక్తిం
దవిలిన [2]సతి కతఁ డొడఁబడఁ, డవ్వానినియు నతని విడువ నగు భక్తిమెయిన్.
పురుషునకు భక్తి లేదని, పురుషేచ్ఛకు నడన(ఁ) జనదు పురహరుభక్తిన్ [లేన్
బర(ఁ)గునతి పురుషు మీ(ఱి)యు(ఁ), బురహరుఁ గొలుచునది సిద్ధమున విడిచిన
పురుష ప్రతికూలత్వ, స్థిరదోషము సతికి దుర్గతిం [3]జేయదు త
త్పురుషుఁ డభక్తుఁడ యేనిం, బురుషుని మీ(ఱి)యును శివునిఁ బూజించు నెడన్.
అనసూయయను సాలాంశసి, యనుమునిభార్యయు [4]నిజాధిపాతివ్రత్యవృ
త్తి[ని] శివునిచే నభీష్టము, లనూనముగఁ బొల్లి పడసి రచలితభక్తిన్. ౨౩౮
వినువక యిది కారణముగ, ననమేతుల సచలభక్తి నర్చించుటతో
ననదృశము లన్యధర్మము, లసారములు [దీని]బోలవం బ్రాదిమునుల్. ౨౩౯
స్వాభావికములు దుర్బో, ధాభావము నీదుకరుణ నగు నంతకము
న్నేభంగులఁ బొగడిన శివ, నీభక్తులమహిమ మెఱుఁగ నేర్తురె మూఢుల్.
సర్వజ్ఞ రాజశేఖర, సర్వేశ్వర యనుచు నాకపిశాచముఁ బొగడున్
సర్వజ్ఞ రాజశేఖర, సర్వేశ్వర [5]యనఁడు నిన్ను జడబుద్ధి శివా. [మహిన్
జడమతు లల్పను రొ(ఱ)ఁగెదు, నెడ వారలు శివునిమహిమ మె(ఱు)ఁగుదురె
జడనిధి మొకల్పులోఁతును, గడు నె(ఱు)ఁగునె నూఁతిలోని కప్పలు బుద్ధిన్.
[6]నెఱిఁ జదువు లెన్ని చదివియు, నె(ఱు)ఁగరు జడమతులు శివుని [7]నిట్టిదకాడే [ర్వుల్
మెఱుఁగు నెవంటకము లచని, మొ(ఱ)వగ మ(ఱి)యుంచ మెల(ఁ)గుచుం బొడిచిన
వేదపురాణము లె(ఱ)ఁగిన, బోదతుఁ డగు శివుని నె(ఱు)ఁగనోపదు పాపుల్
మేదినిఁ జూచియుఁ [9]బూర్వది, శాదిత్యునిఁ గౌశికంబు లనునవి గనునే.
మానక చదువులు చదువుచు, వానికిఁ బ్రతికూలుఁ డైనవానిని శివు ని
త్యానందు నిన్ను గొల్వని, మానిసిగాడ్దియలు భువి నమాన్యుల కారే.

1. జనదీనిం. 2. పతి. 3. జేయుదు. 4. నిజారిపాలి. 5. యనుండు. 6. నెఱుం. 7. నిదన. 8. నదోదిత. 9. బగలుదిశా.

ఒకనైష్ణవుఁ డొకమిాఁహాం, సకుఁ డొకబాద్ధుండు నొక్క జైనుఁడు (ఁ) త్రిపురాం
. తకుభక్తునట్ల [ని]జసా, ళికదృష్టాం[తప్ర]సిద్ధిఁ గీర్తనఁ గనిరే. ౨౮౨

భక్తిలేక ముక్తిలేదు.

జ్ఞాని యగువాఁడు భక్తిని, హీనుం డగు[నేని] ముక్తి కెయిదఁడు నృపతి
జ్ఞానము గలిగినఁ బ్రోచునె, మానవపతిఁ గొలువకున్నమానవుని శివా.
గజశాస్త్ర మె(ఱి)ఁగినంతనె, గజాధిరోహణము సేయఁగావచ్చునె ని
న్నజు సర్వేశ్వరు నె(ఱి)ఁగియు, భజియింపక ముక్తి వడయ భారము గాదే.
ఎడపడని శివజ్ఞానము, దొడరి సమస్తమును విడిచి దురహంకారం [నిన్నుశివా.
బుడిగి తను మ(ఱ)చునంతకు, మృడు(ఁ) గొల్వఁగవలయుఁ గ్రియలమెయి
వేపరక క్రియాఫల[1]స, న్న్యాసము గావించి క్రియల నానావిషయ
.[2]వ్యాసంగ ముడుగునంతకు, నాసనమై నిన్ను గొలువవలయు మహేశా.
క్రియ లుడిగి యోగి జ్ఞాని యా, రయ విషయము లుడుగకున్న [3]రాగాంధుఁడుప్ర
త్యయవిరహితాత్ముఁ[4]డతిపా, పయుతాత్ముండాతఁ డుభయభ్రష్టుఁడురుద్రా. [శా
క్రియలెట్టిఁగి యె(ఱి)ఁగియుడిగిన, [య]యుక్తియుక్తుండుపతితుఁడనఁబడు(ఁ) గ్రియ
శ్రయమైనయహంకారము, క్రియగొనఁగానుడుగకవ్వు నె క్రియ లుడుగశివా.
ఏ ననియెడునభిమానము, [జానుగఁ] బిరుఁదుడుగుటయు నిజక్రియలునుదా
. సీనములై పిరుఁదుడుగు[ను], దానై యుడిగెద నసంగ(ఁ) దగదు మహేశా.
ఉన్నతసముదితనిజ[5]సం, పన్నాభ్యంతరశివైక్యభావానుగతిం [శివుఁగా.
దన్నె(ఱు)ఁగమ(ఱ)చునంతకు(ఁ), బన్నుగఁ బూజింపవలయు బాహ్యమున
పొరిఁ దొనకుఁ దాన క్రియ లవి, నిరంతరాభ్యాసపక్వనిర్ణిశాంతః
కరణవిశుద్ధశివైక్య, స్ఫురణత జ్ఞానప్రలీనబుద్ధికి [6]నుడుగుఁగా. ౨౫౧
ఏ నని యెఱు(ఁ)గుట మ(ఱ)చి శి, వానందానుభవమగ్నుఁ డగునంతకు ము
న్నే నుడిగెద నని బాహ్యవి, తానశివారాధనంబు దగ దెడ నుడుగఁగా. ౨౫౨
అంగం బగు[7]నాభ్యంతర, మంగజహరునకుఁ బ్రధాన మగు బాహ్యం బా
యంగప్రధానములలో, నంగమ సేకొని ప్రధాన [8]మగునే విడువఁగా. ౨౫౩
అంగాభ్యంతరవిధమున, నంగజహరుఁ గొలిచి ముఖ్య మగుబాహ్యవిధి[గా]
లింగాకృతి శివు(ఁ)గొలువని, వెంగలిమానవులకంటె [9]వెడఁగులు గలరే.

---

1. సంన్యాసముగానిచ్చు. 2. వ్యాసంగ. 3. రాంగాధుడు. 4. పాపాత్ముండుభయభ్రష్టుండు.
5. సంపన్నభ్యం. 6. నుడుగఁగా. 7. నభ్యంతర. 8. మగునేనివిడువఁగా. 9. వెండగులు.

సాంగముగా వేదములకు, భంగిన వేదాంతములకు బ్రష్టోదులకుఁ
లింగస్వరూపవిరహిత, గంగాధరరూప మె[లు]ఁగఁగాఁ దలముగునే. ౨౫౫
వనజాసనవనజోదర, సనకాదులు ముఖ్యబాహ్యసంత్యాగము సే
సినవారు గారు తక్కటి, ¹పినుఁగులు బాహ్యంబు విడిచి పెద్దయుఁ జెడరే.
స్థిరముఖ్యబాహ్యపూజా, కరణము లేదయ్యేనేని గౌణకృతాభ్యం
తరవిధి నైనను భక్తిం, బరమేశ్వరుఁ గొలువకునికి పాపము గాదే. ౨౫౭
పర[మ]హితయథోక్తాభ్యం, తర²పూజను విడిచి యేన దైవమ నని దె
ప్పర మగునాస్తిక్యమతిఁ, హరుఁ గొలువనినరుఁడు పతితుఁ డనఁబడుజగతిఁ.
అవికలదేవాసురనర, నివహసదాపూజనీయనిత్యోత్సవస
చ్ఛివలింగపరాఙ్ముఖమా, నవసంభాషణము లెల్ల నరకార్థ మగుఁ. ౨౫౯

## బాహ్యపూజ చేయవలయును.

ఒసలు గుడి యంతరాత్మయు, బసరుం డనుపలుకు లుడిగి భక్తిని గుడియే
గుడి[యనియు]లింగమూర్తి[యు], బసరుం డని కొలువకునికి పాతకముశివా.
వేదోక్తవిహితకర్మను, హాదేవార్చనవిహీనుఁ డగుపాషండిం
గా నెదురఁ జూడఁ జూచిన, యాదోషము వోనఁ జూచునది భక్తులకుఁ.
శివసమయంబున ³కెరిసరెడు, నవిసీతుల రెంత పెద్దలైనను మ్రొక్కఁ
శివభక్తులకును ద[గద], క్కవిచారుల మ్రొక్కు [లెవుడు]గొనఁ గాదు శివా.
తా దప్పుఁగొనఁగ నప్పిఁ, గా దీఁ గొనఁ గాదు గాదు కనఁ దమలో నా
ప్లోపమునఁ బలుకఁ గాదు మ, హాదేవపరాఙ్ముఖాత్ములగుపతితులతోఁ.
తాదు సమశయ్య(ఁ) బొంద[ం], గాదు సమాసనమునందుఁ గదియఁ ⁴జరింపం
గాదు సహ⁵వాసమును మ, హాదేవపరాఙ్ముఖాత్ములగుపతితులతోఁ. ౨౬౪
చేతోజాతవిమర్దన, భాతిగ నినుఁ గొలువనట్టిపాలసునకు సం
ప్రీతిని గుడువం బెట్టిన, ఘాతకు యమదండనంబుఁ దప్పదు రుద్రా. ౨౬౫
. . . . . . . . . . నించుక లేని నాస్తికస్థితివిషయా
ధీనదురాచారికి రొ, గానందము గలుగ నేర్చునయ్య మహేశా. ౨౬౬
తా దతని వేఁడి కుడువం, గా దతనికి(ఁ) గుడువఁ బెట్టఁ గాదు భజింపం
గా దీఁ గొన దానమును మ, హాదేవపరాఙ్ముఖాత్ములగుచరితులతోఁ. ౨౬౭

1. బరుంగులు. 2. తరపూజనమువిడిచియేనన్దైవమనని. 3. గెడరెడు. 4. జరింపఁ.
5. వాసమునునునుహా.

అవికతనిరతిశయంబుగ, శివయోగరసానుభవవిశిష్టసుఖంబుల్
[1]వవిలిన మోహములు విషమో, ద్భవసుఖలేశంబు మ[ఱ]చి తలఁతురె రుద్రా.
[2]ని న్నెఱుఁగుచుఁ దన్నెఱుఁగని, యున్నఁడు శివయోగమగ్నుఁడనఁబడు [మదిలో]
నిన్నును దన్ను నెఱింగెడి, యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడును శివా.
ఎడపక యష్టాంగంబై, పడంగమై యొండెఁ బర(ఁ)గు శంకరయోగం
బెడయకుఁడుగ నభ్యసించినఁ, గడుకొని సంసారవార్ధిఁ గడునఁగవచ్చున్.
అష్టాంగయోగభక్తి న, భీష్టఫలప్రదుఁడ వైన యీశ్వర నిన్నుం
దుష్టినను గొలిచి ముక్తివి, శిష్టసుఖాఖ్యు లగుటకు దె శివయోగాఖ్యుల్.
శివయోగిదర్శనంబున, నవు గంగాస్నానసమమహాపుణ్యఫలో
త్సవగతి [3]తత్సంభాషణ, సవినయవిధి సకలతీర్థసత్ఫల మదరున్. ౨౭౨
వేదవిదు లైనకోటిమ, హీదేవోత్తములు గుడిచి యిచ్చుఫలంబా
హ్లాదంబున శివయోగికి, నాదట భిక్షంబు పెట్టినంతన పొందున్. ౨౭౩
శివయోగిశిరంబున[నే], శివుఁ డెప్పుడు నుండు నని విశేషప్రీతిన్
శివయోగిఁ జూచి సాక్షా, చ్ఛివుఁ డని కడు భక్తిఁ బూజ సేయఁగవలయున్.

శివనిందకులం జంపవచ్చును.

ధ్రువముగ సర్వప్రాణుల, నవశ్యముసు జేయకుండునది హింస మదిన్
శివనిందకు లగుపాపుల, నవిచారితవృత్తి(ఁ) జంప నగు నీశానా. ౨౭౫
శివనిందావిషయం బగు, ననమానము సెప్పునట్టి[4]యపస్తకముల్
అవిచారంబునఁ గాల్పఁగ, నవుఁ జెప్పెడివాని(ఁ) జంపనగు నీశానా. ౨౭౬
శివనిందాకరు(ఁ) జంపిన, జనము(లే) తత్కారణమునఁ జచ్చిన నీరెం
డువిధంబుల నీకారు, ణ్యవశంబున ముక్తిఁ బొందు నరుఁ డీశానా. ౨౭౭
శివ నీతనర్థమొండెను, శివభక్తార్థంబయొండె శివవిద్యాచా
ర్యవిషయమొండెను జీవ, మ్మువిసర్జించి[న]నరుండు ముక్తుఁడు రుద్రా. ౨౭౮
సంహృతశివ నీభక్తికి, నంహోమతి వక్త్రులైన నప్పుడ [5]'తే శ్రీ
ఘ్రం హన్తవ్యా' యనుటను, సంహారించుటయ పథము జనకుల నైనన్.
పావనమై[న]శివక్షే, త్రావాసమునందు నొండె ననశనవిధినై
జీవత్యాగము చేసిన, భూవినుతుఁడు మోక్షపదవిఁ బొందు మహేశా. ౨౮౦

---

1. దగిలిన. 2. నిన్నెఱుగించున్. 3. దర్శనలభాషణ. 4. నపస్తకముల్. 5. తత్ప్రి ప్రంహన్తవ్యాయన సం . . . జనకులైనన్.

శివతీర్థములో నొంజెను 1శి, వాజ్ఞలో నొంజె[దాను]జీనత్యాగం
బు విధించినమానవుఁడును, భవత్ప్రసాదమున ముక్తిఁ బడయు మహేశా.

చచ్చిన శివభక్తునకుఁ బరలోకవిధులు వలదు.

ఎందును శివార్థముగ మృతిఁ, బొందినపుణ్యాత్ము2బంధుపుత్త్రాదులకుఁ
బొందదు సూతక మతనికి, వందురి పరలోకవిధులు వలదు మహేశా. ౨౮౨
వెంగియు శివార్థమృతునికి, నొండొకపరలోకవిధులు నొడఁబడిరే వా
రొండుఁడిగి యథాశక్తిం, బండుగ సేయుదురు రుద్రభక్తులకు శివా. ౨౮౩
పితృలోకవిష్ణులోకము, లతిక్రమించి శివ3పురికి నరిగెడుభక్త
ప్రతతికిఁ బితృమేధక్రియ, లతిశయముగఁ జేయునాతఁ డజ్ఞుఁడు రుద్రా. 
అంతకరిపుభక్తుని చే, పొంతంబున నతనియర్ధ మాగమయుక్తిఁ
సంతతి గలిగినఁ దత్పుసు, సంతతి కీఁడగదు శైవసంతతి దక్కన్. ౨౮౪

శివాపచారులు శిక్ష.

సకలామరదైతేయ, ప్రకరసదారాధ్యమానపాదాబ్జభవాం
తక నీభక్తులదుర్గుణ, శకలంబుల వెదకువాఁడు చండాలుఁ డజా. ౨౮౫
శివ నిన్నును వేదములను, శివభక్తుల బ్రాహ్మణులనుఁ జెడనాడెడుపు
ణ్యవిహీనుఁ డధోగతిఁ బడి, యమవింశనరకాగ్ని 4బాధలందు మహేశా.
శివభక్తులఁ జెడనాడెడు, నవినీతుఁడు ఘోరరౌరవాగ్నులఁ బడి 5యా
రవితారకమును గాలుచు, ధ్రువముగ వాపఱచుచుండు దురితారాతీ. ౨౮౬
6వెఱవక నీగుడిలోపల, గుఱుకొని యాలాపుపెట్టుకొని యుండెడిపా
దటి జముమాతలు గుక్కలఁ, గ(ఱ)పింతురు మూఁటకట్లు గట్టి మహేశా.
ప్రమదాసంగతి చేసిన, నుమిసిన మ(ఱి)కాళ్లు సాఁచియుండిన శివగే
హములోనఁ జూదమాడిన, నమితమహానరకబాధ లందు మహేశా. ౨౮౭
పావలు(ఁ) జెప్పులు దొడుకొని, చేసి శివాలయములోనఁ ద్రిమ్మ(ఱు)పాపుల్
వా విడిచి నిగళబంధము, తో వాచఱచుచు[ను] గాలుదురు నరకాగ్నిన్.
కుడిచిన నీళ్లాడిన మ(ఱి), గుడిలోపల నలు(ఁ)గు వెట్టుకొన్న 7నభీష్టం
బడుగ(ఁ)[గ] నవ్విన దుర్గతి(ఁ), బడుదురు బాధలను నధికపాపాత్ము లజా.
గుడిలో ముద్దట లడిచిన, గుడిలో వెంద్రుకలు వాచికొనినను నెపుడుం
గడువె(ఱ)వక విహరించిన, గడునరి నరకాగ్నిశిఖలఁ గాలు మహేశా. ౨౮౮

1. శివజ్ఞాలో. 2. త్రిందిపుత్రా. 3. పురికరిగెడు. 4. బాధలందుదురు మహేశా. 5. యా.
6. వెఱువక. 7. అభిష్టం.

అతిగర్వోదాసీనత, గతభయుఁడై [శివ!]శివోపకరణద్రవ్య
1ప్రతతులుగాల్లందన్నిన, నతకడచిన ద్రోహి రౌరవాగ్నులఁ గాలుఁ౯.
2మృడ నీతోఁటలపువ్వులు, ముడిచిన మఱిగానిఁ గోసి మూర్కొన్ననరుల్
కడుఁ గాఁగినసూదుల[తోఁ], నడవఁగఁబడి నరకబాధ లందుదురు శివా.
3శివ నీతోఁటలలోపల, శివగృహములలోననొండె శితమున 4మూత్రా
ద్యవకార్యంబులు చేసిన, యవినీతుఁడు ఘోరరౌరవాగ్నులఁ గాలుఁ౯. ౨౯౮
ఉత్తమకులవిద్యాగుణ, 5విత్తోద్యోగాదిసకలవిషయము లెల్ల౯
6రిత్తయ బుద్ధిఁ దలంప ను, దాత్తభవద్భక్తి లేనియధములకు శివా. ౨౯౮
కులమునుఁగలిమియుఁ బ్రాయము, గలిగియునుఱి ముక్కు లేనికాంతయుబోలెం
గులమును గలిమియుఁ బ్రాయము, గలిగియు శివభక్తి లేనికష్టుఁడు రుద్రా.
శ్రీరమణార్చిత దురితని, వారణ నీభక్తి లేని7వారల విద్యా
చాతుకులరూపసంపద, లారయఁగా నిష్ఫలంబు లన్నియు రుద్రా. ౨౯౯

దక్షాధ్వరధ్వంసము.

సురముని వైదికమతను, స్థిర[ముగ]ద[క్షు]ప్రజాపతి యొనర్చినవి
స్తరసత్త్రియ దేవభవ, ద్విరహితముగఁ జేసికాదె విఫలత నొందె౯. ౩౦౦
వేదములు ప్రమాణములుగ, నాదిన యొడఁబడియు వాని నతకడచి భవ
త్పాదనుతి విడిచి 8చెడియెను, పాదరి దక్షుండు వీరభద్రునిచేత౯. ౩౦౧
అలరిన్నైయె శివుఁ బలికిన, పాలనుఁ డని కినిసి వీరభద్రుఁడు ఫాలా
ళీలవిలోచనదహన, జ్వాలల మును దక్షుజన్నశాలను గాల్చె౯. ౩౦౨
9భూతములు దర్భపాత్రాళ్లను, హోతల మెడ లంట(ఁ)గట్టి యూపంబులతోఁ
ద్రేతాగ్నులు యాగాశ్వము, భూతేశ్వర గంగలోనఁ బోవైచె నజా. ౩౦౩
అనిమిషము(ం) గొని రుద్రుని, రోమజగణపతులు చరుపురోడాశమహా
హోమద్రవ్యము లెల్లను, నీమహిమం జేసి దక్షునిం జె(ఱ)చి రజా. ౩౦౪
ధర్మాదిసదస్యులు శివ, ధర్మ10విహీనుండు నైనదక్షునిసభలో(ఁ)
ద్దేర్చెడి భూతములచే, దుర్మదులై కొట్టువడిరి దురితారాతీ. ౩౦౫
ఎలుకల నడచినవిధమున, నలయక దక్షాధ్వరమున కనివచ్చినసా
ధుల మునుల నడిచి చంపిరి, గలహంబునఁ బెరిఁగి ప్రమథగణములు రుద్రా.

1. వ్రతతులుంగాల్లం. 2. మృడునితోఁటల. 3. శివునితోఁటల లోపలి. 4. మూత్రోప్యవకార్యం. 5. విత్తైద్యోగాది, 6. రిత్తనియబుద్ధి. 7. వారలు. 8. చెడియును. 9. భూతములు. 10. విహీనుండైన.

కలియుగమునఁ జోరులచే, బలిమిఁ గులస్త్రీలు నష్టభంగిన హర నీ
  కలుషమున నమరవనితలు, వెలయంగాఁ జెడిరి భూతబేతాళురచేఁ. ౩౦౭

[1]గోకులమును గోపాలకుఁ, డాకులమునఁ [2]దోలునట్లు లమరుల నెల్లం
  జేకొనక తోలి సంపె ను, హాకోపుఁడు వీరభద్రుఁ డతిబలుఁడు శివా. ౩౦౮

మారారిద్రోహునింటికి(ఁ), జేరంటమువచ్చి తనుచుఁ బెలుచను గోసెన్
  వైరమున నదితిముక్కును, భారతి[3]నాసికయు వీరభద్రుఁడు రుద్రా. ౩౦౯

ఆలరిదక్షునినోమున, కేలా చనుదెంచి తనుచు నీశానదిశా
  . . . . . . . . . . . . . ౩౧౦

నిష్ఠురముగఁ బ్రమథగణ, ప్రష్ఠుండై నెగడువీరభద్రుఁడు దారా
  జ్యేష్ఠునిఁ జంద్రునిఁ బాదాం, గుష్ఠంబున ధరణిఁ ద్రొక్కె మోఁ గోపమున శివా.

[4]దక్షుశిరంబును రణజయ, శిక్షావిధి యజ్ఞపురుషుశిరమును [5]దునిమెన్
  దక్షాధ్వరంబులోఁ బ్రతి, పక్షక్షయకారి వీరభద్రుఁడు రుద్రా. ౩౧౨

వడి మృగరూపము(ఁ) గైకొని, చెడిపా(ఱ)కుయజ్ఞపురుషుశిరము దెగన్ వ్రే
  ల్మిడిలోన నేసి చంపెనుఁ, గడువీరుఁడు వీరభద్రగణనాథుఁ డజా. ౩౧౩

స్వాహాపతిభామిని యగు, స్వాహాంగనముక్కు నెకముచను మొనయుఁ దగన్
  సాహసముతోడఁ జిదిమిన, బాహుబలం బొప్పె వీరభద్రునకు శివా. ౩౧౪

స్వాహాపతి[6]జిహ్వ శివ, ద్రోహునిజన్నమున నాహుతులు గొన్నది[7]యన్
  ద్రోహమునఁ గోసివైచెను, బాహుబలుం డైనవీరభద్రుఁడు రుద్రా. ౩౧౫

పోలఁగ దక్షుఁడు సత్క్రియ, మేలని చేయుటకు నశ్వమేధము గీడై
  కోలాహల మయ్యెఁ గ్రియలు, సాలఁగ శివభక్తిలేకసహజము లగునే. ౩౧౬

కర్మఫలదాత త్రిజగ, న్నిర్మాతమహేశ్వరుండు నిఖిలపశు[8]వ్రా
  తమ్ముల కధిపతియనిక్రియ, [9]లిమ్ములఁ జేయునది మనుజు లీశ్వరభక్తిన్. ౩౧౭

ఆహరిను రేంద్రముఖ్యను, ధాహారుల [10]నెల్ల నిట్టు లత్యుద్ధతిమై
  దేహములు గోసివైచిన, బాహుబలం బొప్పె వీరభద్రునకు శివా. ౩౧౮

ఆహవమున[ండుఁ][11]దెగి[యు], య్యాహవనీయాగ్నిఁ బడియె నట విష్ణుశిరం
  బాహా నీకింకరునకు, బాహుబలం బొప్పె వీరభద్రునకుశివా. ౩౧౯

---

1. గోకులమునం. 2. దోలునట్లమరుల. 3. నాసికము. 4. దక్షునిశిరంబును. 5. మేనున్.
6. జింహ్వయు. 7. యును. 8. వ్రాతమ్ములకు. 9. లిమ్ములకు. 10. చెల్లనిట్లుత్యుద్ధతి. 11. దెగియు.

——— ప్రళయవర్ణనము - గణాధిపులయాటలు. ———

కర్మక్షయంబు గామిని, నిర్మలమోక్షంబు లేమి నిఖిల[1]పశువ్రా
తమ్ములదుఃఖంబులు గని, నిర్మింతు లయంబు గొంత [2]నిర్వృతికి శివా. 3౨౦
కరుణా[3]కరుఁడవు గావున, విరచితబహుజీవరాశి[4]విశ్రమహేతు
స్థిరమలనిఖిలజగత్సం, హరణము గావింతు కరుణ [5]నతిమహిమ శివా. 3౨౧
ప్రమథులు రుద్రులు[మఱి][6]భూ, తము లనఁగాఁ ద్రివిధ[7]మూలదళములతోడన్
సమసుప్తి[8]నాథ నీగణ, సమూహములు సంహరించు జగములు రుద్రా. 3౨౨
కుమ్మరి దరిగొల్చిన[9]చి, చ్చిమ్ముల నావంబుకడవ లెల్ల [10]దరికొనం
గ్రమ్ముగతి నజాండంబులఁ, బ్రమ్ము భవన్నేత్రనహ్ని ప్రళయమునశివా. 3౨3
భవదుద్భటనిటలేక్షణ, భవజృంభితనిటలవహ్ని పర్వ జగద్వి
ప్లవహేతు వయ్యెఁ బ్రమథుల, కవిరళసుఖహేతు వయ్యె నదియె మహేశా.
లోకంబులు ప్రళయాగ్నిశి, ఖాకలితములై తపగ్నిఁ గాలఁగ(ఁ) [11]బ్రమథా
నీకములు వెరి(ఁ)గి యాడుమ, హాకౌముదిఁ దేలియాడునట్లు మహేశా.
త్ర్యంబక నీప్రమథగణా, డంబరవిభవంబు గడు నాడంబడ సంహా
రంబు[ను]వర్ణన సేయఁగ, లంబోదరషణ్ముఖాదులకు నరిది శివా. 3౨౬
ససముద్రద్వీపాచల, వసుమతి వడి మీఁది [12]కెగురనైచి ననషు [శివా.
త్రసురావాసా[13]కాశము, వెనఁ గ్రిందికిఁ దిపుచుఁ బ్రమథవిభుఁ డొకఁడు
కడు మండెడుబడబాగ్నిం, [14]బడయక వడిఁ గూడఁ దిగిచి తనను దుటను బొ
ట్టిడికొని యానందంబున, వెడ సోలుచు నాడుఁ బ్రమథవిభుఁ డొకఁడు శివా.
సకలసముద్రజలంబులు, నొకగణనాయకుఁడు ద్రాగి [15]హుఱ్ఱబ్బని త్రేన్చున్
సకలగ్రహతారకములు, నొకగణనాయకుఁడు వాఱ నూఁదు మహేశా.
ద్వీపము లేఱును జక్ర, వ్యాపార[16]విధమునఁ ద్రిప్పి వైచురు వా[ఱ]న్
నీపంపునఁ గొందఱు బహు, రూపులు గణనాయకులు విరూపాక్ష శివా.
యమమహిషశృంగములు నిం, ద్రమహాగజదంతములుఁ బ్రతాపముతోడన్
సమసుప్తి దుస్సికొని నీ, ప్రమథులుఁ దాలములు వేసి పాడుదురు శివా. 33౧
పడ వేసిమృత్యు[17]దేవత, మెడ[18]మసములఁ ద్రొక్కి- దాని[19]మెటచెడికో(ఱ)ల్
వడిఁ బెఱికికొనిమహోల్కా, ముఁ, లుడుగక త్రిప్పక్రియఁ ద్రిప్పునొకగణముశివా.

1. పశువ్రాతమ్ములు. 2. నివృత్తికిని. 3. కరుణావు. 4. విశ్రమ. 5. నతిమహిమ. 6. భూతములనంగా. 7. ద్రివిధమూలంబ్రావముతోడన్. 8. నాథునిగణ. 9. చిచ్చుమ్ముల. 10. దరికొనిం. 11. బ్రమథాని. 12. కెగర. 13. కాసము. 14. బడయకవడి. 15. హుఱ్ఱబ్బని. 16. విధమునసుం. 17. దేవర. 18. మంసలం. 19. మెటచెడికోఱల్.

వరుణునిసుకరము వాయువు, హరిణముఁ గడిచేసి మ్రింగి యానురముగ ది
క్కరులం దిని త్రేఁచును శం, కర నీగణనాథుఁ డొకఁడు [1]గడికాఁడు శివా.
కొంచ(బు)గణపతు లత్త(ఱి), మందరహిమవత్ప్రధానమహితమహీభృ
త్సందోహంబులుఁ గొని కడు, సందముగా నూడుపట్టె లాడుదురు శివా.
సురపర్వతాదిధరణీ, ధరకందుకకేళి సలిపి తత్క్షణమున [2]న
గ్గిరులు వొడిచేసి చల్లుచు, నరుదుగ గణపతులు గొంచ(ఱా)డుదురు శివా.
పూని వడిఁ దిగిచి యష్టమ, హానాగమ్ములను [3]మిద్దియలుగా వ్రేళ్లన్
మానుగఁ గొంచ(బు)దాల్తురు, వానిఫణామణులరుచులు [4]వట్టుగఁ బ్రమథుల్.
ఆదివరాహము వె(రిఁ)గిస, యాదంష్ట్రలు వె(ఱి)కి [5]తననిజాస్యంబున సం
పాదించికొని నటించు మ, హాదర్పముతోడ నొకగణాధిపుఁడు శివా. 332
మ(ఱి)యాదికూర్మపృష్ఠము, దొఱయఁగవడి(ఁ)బొడిచి [6]యందుఁదూర్చిఫణీంద్రున్
నెఱిఁ ద్రిప్పటముగఁ ద్రిప్పుచు, వఱలఁగ గణనాథుఁడొకఁడు వడి నాడు శివా.
నరసింహునికంఠంబును, నరుణజటాకేసరంబు లంబికపాదాం
బుజహంసపీఠమునఁ బొ, ల్పరుదుగ రచియించు నొకగణాధిపుఁడు శివా.
ప్రమథాధిపతులుఁ గొంచ(బు), కొమరుగ నొష్టణము దండ గ్రుచ్చి[న]భంగిన్
హిమకరమండలమును [7]సూ,ర్యమండలము దండ గ్రుచ్చి యాడుదురు శివా.
[8]నుఱుమైప(ఱి)యలు వా(ఱ)ఁగ, న(ఱ)చేత నజాండభాండ మవియఁగ వ్రేయన్
మఱిబ్రహ్మ యేఁడియును చు[ను], వఱలఁగ గణనాథుఁడొకఁడు వడి వెదకు శివా.
వారిజభవునికపాలము, గోరి [9]త్రివిక్రమునిపేఁపుకో లెమ్ముతుదిం
జారుగతి నిలిపి ఛత్రా, కారంబుగఁ దాల్చి యాడు గణనాథుఁ డజా. 333
చరణం[బులుఁ]జరణంబులుఁ, గరములుఁ గరములునుఁ [10]జెనఁచి కంఠమున గణే
శ్వరుఁడొకఁడుదాల్చియాడును, విరించి[11]విష్ణులసబములు విలయమున శివా.
వడి నిడుపుగఁ బెరు(ఁ)గుదు ర, ప్పడ [12]నిడుపుడిగించి గుజ్జుఁ బొడవగుదురు వీ
డ్వడి వలుదత్రుంగు లొల్లక, కడుసన్నము లగుదు రిట్లు గణములు రుద్రా.
[13]వెగడుగ వసురుద్రాది, త్యగణేశసమస్తదేవతారాక్షసప
న్నగగణములన్నియునుఁ జెడి, గగనంబంతయును బ్రమథగణమయ్యె శివా.

---

1. గలికాండు. 2. నగిరులువడిచేసి. 3. ముదియలుగా వ్రేళ్ల. 4. దట్టుగం. 5. తనని జాస్యంబుగ. 6. యందుగూర్చి. 7. సూర్యమండలమును. 8. నుఱిమై. 9. త్రివిక్రముని. 10. జెంచి. 11. విష్ణులశబములు. 12. నిడుపుడిగించుకొనిగుజ్జు. 13. వెగంజగ.

అడుదుతు [1]జతలువెట్టుచు(ం), బాడుదురు[ౡ] గతులుచేసి పరమానంద
క్రీడానంగతిఁ బ్రమథులు, కూడి వినోదింతు రిట్లుఁ గొమరుగ రుద్రా. ౩౮౬
లోకాలోకము సురపతి, లోకముతోఁ గూడి బ్రహ్మలోకమువ(జి)యూ
వైకుంఠలోకమునుఁ జెడి, లోక[2]త్రయ మెల్లఁ బ్రమథలోకం బయ్యెౝ. ౩౮౭


శివగణవర్ణనము.

ప్రమథగణంబు లసంఖ్యాక, తమ లీశ్వర యెఱుఁగ వ్రేఁగు దత్సంఖ్యలు వే
దములు[3]"నసంఖ్యాతా"యని, యమరఁగఘోషించుచున్నయవిగడలేమిౝ.
సకలకులపర్వతంబులు, నకుటిలగతి గ్రుచ్చి కంఠహారముగా [4]నొ
క్కొకమాటు భవద్గణనా, యకుండుఁ[దాఁ]దాల్చుఁ బర్వతాభరణుఁ డజా.
పరివిలయ[5]వేళ మేరువుఁ, బరిమార్చుటఁ జేసి [6]మేరుపాతనుఁ డనఁగా
బర(ఁ)గిన[7]గణనాయకుఁ డొక(ఁ), డరుదెవ్వరికైనఁ బొగడనక్కఱఁడు శివా.
ఖండేమి సమస్తబ్ర, హ్మాండంబులుఁ బూసపేరులై యుండఁగ ను
ద్దండగతి గ్రుచ్చి యాడఁగ, నండాభరణుఁ డన నెగడె నతిబలుఁడు శివా.
వెండి హరిబ్రహ్మాదుల, రుండము లాభరణములుగ . . . . .
రుండాభరణుఁడు నా నధి, కుండు భవద్గణవిభుండు గురుభుజుఁడు శివా.
వెండియు నానాకారులు, వెండియు నానాప్రతాపవిక్రమవిభవుల్
దండితదైత్యేంద్రులు నర, గొంటప్రియ నీగణములు గొంట(ఱు) రుద్రా.
లాలానురవక్షస్థలు, కీలాలజలప్రవాహ కేళీలోలా
భీలత్రిశూలహస్తులు, [8]హాలహలాంకులు భవద్గణాధిపులు శివా. ౩౯౪
రాజార్ధధరులు నరసుర, రాజామరభయులు రాజరాజసఖులు గో
రాజపతాకులు గేశవ, రాజప్రియ నీగణములు [9]రాజాభరణా. ౩౯౫
బ్రహ్మాభివంద్యముఖ్యులు, బ్రహ్మకపాలావళీ[10]విరాజితులు వర
[11]బ్రహ్మాకారులు . . . , బ్రహ్మేశ్వర నీగణాధిపతులు కపర్దీ. ౩౯౬
శ్రీరమణులు సకలజయ, శ్రీరమణులు వేదశాస్త్ర[12]శివతత్త్వవిదుల్
శీరాలప్రియ భోజను, హారాజప్రియ [13]భవద్గణాధిపులు శివా. ౩౯౭
[14]వివిధాబ్ధిమహాజలధర, రవులు గణేశ్వరులు మలయరాజప్రియ . . .
. . . , గొంట(ఱు), భువనత్రయసుందరులుఁ ద్రిపురదహన శివా. ౩౯౮

---

1. జెతులు. 2. త్రయం మెల్ల. 3. నసంఖ్యాతా. 4. నొక్కొక్క. 5. మేళ మేఋవు. 6. మేలంపాతనుండ. 7. గడనాయకుఁడరుదేవురకైన. 8. హాలాహలాంకులు. 9. రాజరాజాభరణా. 10. విరాజారులు. 11. బ్రహ్మకారులు. 12. శివతత్త్వవిభుల్. 13. భవద్గణవిపుంగవులు. 14. వివిధాభి.

శ్రీశ్రీదిగంబరులు నా, క్శ్రీశ్రితమహిములు జగత్ప్రసిద్ధులు భక్తి
శ్రీశ్రితహృదయాంభోజులు, శ్రీశ్రిత నీ[1]గణము లెవ్వ డజేయులు రుద్రా.
లంబోష్ఠలంబనాసిక, లంబోదరలంబనేత్రలంబశ్రవణుల్
లంబహనులంబజిహ్వులు, నంబాప్రియ నీగణాధినాయకులు శివా. ౩౬౦
అజకర్ణు లశ్వకర్ణులు, [2]గజకర్ణవరాహకర్ణఘంటాకర్ణుల్
త్రిజగద్రమణీయులుఁ దెలు(ఁ), గు[3]జోమయప్రియనీగణములుగొంచఱురుద్రా.
అజముఖవరాహము[ఖులును], గజముఖమార్జాలముఖులు గణనాయకు లం
డజముఖులు వెండి యప్పుడు, నజామరుల కధిక తేజు లాశ్చర్య లజా. ౩౬౨
గోముఖులు [4]వరాహముఖులు, సామజముఖు లుష్ట్రముఖులు సారంగముఖుల్
భీమవ్యాఘ్రముఖులు నా, నాముఖులు భవద్గణాధినాయకులు శివా. ౩౬౩
నానావర్ణసమేతులు, నానారూపధరు లర్ధనారీశ్వరు ల
శ్వాననమహిషాననసిం, హాననశరభాననులు గణాధిపులు [5]శివా. ౩౬౪
ముఖ[6]పాదులు పాదముఖుల్, ముఖకుక్షులు కుక్షిముఖులు ముఖహీనులు ష
ణ్ముఖపంచముఖచతుర్ముఖు, లఖండవిక్రములు నీగణాధిపులు శివా. ౩౬౫
ద్విముఖత్రిముఖగణాధిపు, లమేయ గుణు లురుతరముఖసహస్రముఖుల్స
ప్తముఖాష్టముఖనవముఖద, శముఖులు నీకింకరులు విచారింప శివా. ౩౬౬
బాహుముఖులు ముఖబాహులు, బాహూదరు లుదరదీర్ఘబాహులు[7]గొంద(ఱ్)
బాహూరులూరుబాహులు, బాహులుబహుబాహులేకబాహులు ప్రమథుల్
బహువక్త్ర లేకవక్త్రులు, బహుదంష్ట్రులదంష్ట్రు లధికబలసంపన్నుల్
బహునేత్ర లేకనేత్రులు, బహుకర్ణు లకర్ణు లెన్నఁ బ్రమథులు రుద్రా ౩౬౮
బహు[9]జిహ్వ లేకజిహ్వులు, బహు[10]పాదు [లపాదు] లేకపాదులుగొంద(ఱ్)
బహుఘ్రాణులు బహుమేఢ్రులు, బహురూపులు నీగణాధిపతులు కపర్ది.
గణుతింపఁగ మ(ఱి)ఁగొంద(ఱు), [11]గణపతులుఁ గపాలమాలికా[12]విషధరకం
కణచంద్రకళాభూషణు, లణిమాదిగుణాన్వితులు మహాత్ములు రుద్రా. ౩౭౦
పింగళకపర్ద[13]డమరుక, గంగాభసితాంగరాగఖట్వాంగధరుల్
భృంగిరిటిప్రియ నీగణ, పుంగవులు సమస్తలోకపూజితులు శివా. ౩౭౧

---

1. గణములజేయులు. 2. గజకర్ణులువరహకర్ణ. 3. జోమ్మయ్యప్రియు. 4. వరాహము ఖులును. 5. రుద్రా. 6. పాదులుపాదముఖును. 7. కొందఱుబహుబాహు. 8. లుబహుబాహు. 9. జిహ్వులేక. 10. లేకపాదులు. 11. గణపతులుంగొందరు గణపతులుంగపాల. 12. విసధర. 13. డమరుగ.

కంటకనరసింహాశిరో, లుంటాకు లిసేందువహ్నిలోచను లుగ్రుల్
ఘంటాకర్ణప్రియ ని, ష్కంటకులు భవద్గణాళిగౌరవ [1]మహిమా. ౩౭౨
నీలగ్రీవులు శుంభ, త్కాలా[2]ఖిలాక్షిదహనభస్మీకృతదు
శ్శీలత్రిపురమహాసుర, కోలాహలు లెన్న [3]బ్రమథకుంజరులు శివా. ౩౭౩
త్ర్యక్షు భవద్గణనాయకు, [4]లుక్షేంద్రారోహణులు [5]మహోక్షపతాకుల్
దక్షాధ్వరవిధ్వంసులు, [6]సాక్షాత్పరమార్థతత్త్వసమ్యగ్జ్ఞానుల్. ౩౭౪
కరినరసింహవ్యాఘ్రా, సురచర్మధరు ల్మహోగ్రశూలధరు ల్భ
కరపన్నగేంద్రకంకణ, ధరులు భవద్గణము లధికదర్పితులు శివా. ౩౭౫
నారాయణాదిసురదను, జోరగమునిమానవేంద్రయూథసదాలో
కారాధ్యమానచరణాం, భోరుహులు గదయ్య ప్రమథ[7]పుంగవులు శివా.
చక్రాసహవిక్రములుం ద్రి, విక్రములుం గపాలధరులు [8]విధిమస్తకదా
మాక్రాంతోదరు లాజి, ప్రక్రసుపాలనులు ప్రమథవర్గము రుద్రా. ౩౭౭
మురవైరిపంకజాసన, శిరోవిభేదకులు సకలశివధర్మవిదుల్
భరితజగదండరక్షా, పరాయణులు భూరిభుజులు ప్రమథులు రుద్రా. ౩౭౮
[9]ధరితశిఖండులు ముండులు, గురులఘువులుస్థూలసూక్ష్మకుంజరదీర్ఘుల్
పరికింపఁ గామరూపులు, హర కొంద(ఱు)మీగణంబు లతిశాంతాత్ముల్.
నానానామాంకితులు స, దానందులు సాంబరులు దిగంబరులు మహా
దానవవినోదులు ప్రమథులు, నానాసురహరులు ప్రమథనాయకులు శివా.
వీరాచార్యాచార్యులు, వీరవ్రతవిదు లవార్యవిక్రములు మహా
వీరావతారు లసములు, వీరేశ్వర నీగణాళి విష్ణువరేణ్యా. ౩౮౧

సద్భక్తుల మహిమ.

స్వేచ్ఛాచారవినిర్మితు, లిచ్ఛావ్యాపారముక్తహృదయులు [10]భవపా
శచ్ఛేదనకారణులు ద, యాచ్ఛాదితతనులు నీగణాధిపులు శివా. ౩౮౨
సర్వజ్ఞు[లు]సర్వగతులు, సర్వశుభోదయులు సర్వసంగత్యాగుల్
సర్వపరిపూర్ణు లెప్పుడు, సర్వేశ్వర నీగణములు శాశ్వతులు శివా. ౩౮౩
[11]గతవిధినిషేధలౌకిక, గతులు మహామతులు పరమకారుణ్య[12]లతా
కృతికరులు సకల[సు]గుణా, న్వితులు శివజ్ఞానరతులు నీప్రమథు లజా. ౩౮౪

1. మహిమలు. 2. ఖిలాక్ష. 3. బ్రమథకుంజరుండు. 4. లుక్షేంద్రారోహనులు. 5. మహోక్షాపాతకుల్. 6. సక్షాత్పరమార్థ. 7. కుంజరులా. 8. విధిమస్తకస్థామా. 9. దరితశిఖండులముండులు. 10. భవబాశాచ్ఛాదన. 11. తగవిధినెఱుగ. 12. లతాకృతకరులు.

అరుదుగఁ బురాణములలో(ఁ), బరువడి మును సెప్పియున్న భంగి గణాడం
బరవిభవము వర్ణించితి, ధరణీధరవంద్య నాయథాశక్తి శివా. ౩౮౫

తన్ను గణములలోఁ జేర్పుమని కవిప్రార్థన.

దేవా సంసారాంబుధి, లో వెలువడఁజేసి ప్రమథలోకం బెఱుఁగఁ
నావాఁడు వీఁడు నుండీ, నావే[న] న్ను[o]పవే గణంబులనడుమన్. ౩౮౬
ఒండేమి మల్లికార్జున, పండితుఁ డన నుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకో నీయాజ్ఞోన్నతి, నుండఁగఁ గాంతు ననికోరుచుండుదు రుద్రా.
[1]పరమేశ్వర నీప్రమథుల, చరితలు సతతమును విన్నఁ జదివినఁ బ్రమథ
స్మరణము చేసిన శుభములు, దొరకొను దురితంబు లెల్లఁ దొలఁగు మహేశా.
దేవ భవదీయభక్తు లు, మావల్లభ[భ]క్తియోగ[2]మార్గమ్ములు నా
నావిధము [3]లందు రవియును, గోవిందాదులకు నె(ఱుఁ)గ గోచరమె శివా.
ఏభంగిఁ దలఁచు భక్తుం, డాభంగిన నీవు నెగడి యవిరళభక్తి
స్వాభావికత్వపరమ, ప్రాభవవిభ[వ]మున నతనిఁ [4]బ్రణుతింతు శివా.౩౯౦

కొందఱు భక్తుల చరిత్రములు.

తనుఁ గన్నతండ్రితల(ఁ) దెగఁ, దునిమి భవద్భక్తియుక్తి ధూర్జటి యొకఁ డ
త్యనుపమగుణ[నీ]పదవికిఁ, జనఁడె ప్రసిద్ధంబు గాఁగఁ జండీశుఁ డబా. ౩౯౧
[5]తనకన్ను పుచ్చి యొకఁ డ, త్యనుపమమాభక్తి [6]నీపదాంబుజములు నే
ర్పునఁ బూజించి సుదర్శన, మనుచక్రము [7]వడసెఁగాదె యచ్యుతుఁడు శివా.
శివనిందాశ్రవణము[నన్], [8]భవాని తన దేహ మాత్మపావకమునకున్
హావి సేసిగాదె భక్తిని, భవదర్ధాంగమున నుండఁబడసె మహేశా. ౩౯౩
శివనింద వింటి [9]నని ప్రా, ణవియోగాగ్ని[ని][10]యథారుణాధరుఁ డైకా
దె విరాజిత[11]గణపదవికి, భువి నెగడెను వ్యాఘ్రపాదపుత్రుఁడు రుద్రా. ౩౯౪
దేవ నిను వీరభక్తిని, బోవక తనతలలు ద(ఱి)గి పూజించి వడిన్
రావణుఁడు చంద్రహాసము, దేవేంద్రజయంబు వడసె[దె]ల్లముగా దే.౩౯౫
చేతులు రెండును దునిమి మ, హాలాత్పర్యమున [12]మిమ్ము నర్చిం[చి]జగ
త్ఖ్యాతముగ మగుడఁ బడయుఁడె, భాతిగ నీచేత [13]భట్టబాణుఁడు రుద్రా.
గొ(ఱి)యలపా ల్నిమిాఁదను, నెఱయుఁగఁ బిడుకునెడఁ [ద]ండ్రినిష్ఠురుఁ డైనన్
మ(ఱి)వానిఁ జంపి నీపదము, గొలఁదె గణపదవి(ఁగా)టకోటఁడు రుద్రా.

1. ప్రమథేశ్వర. 2. మార్గములలునా. 3. లంద్రవియును. 4. "బ్రతికింతు" అని యుండవలయునేమో. 5. తనుకన్ను. 6. పాదాంబుజ. 7. వడిసె. 8. భవానిఁదన. 9. ననింద్రా. 10. అర్థముచింత్యము. 11. గుణ. 12. నందునిమియర్చిజగ. 13. బట్టబాణుండు.

అరుదుగ శివాగ్నిఁ దనరొడ, లురతరశివభక్తి వీరహోమంబుగఁ జె
చ్చెరఁ గోసి వేల్చి నీదయ, సరి ముక్తికిఁ జనఁడె వీరశంకరుఁడు శివా. ౯౮
కన్నులు రెంటను బుచ్చుచు, మున్నీశ్వర సోమవార[1]మున మాలంగరలోఁ(ఁ)
బన్నగ శివనాగయ ని, న్నున్నతిఁ [2]బూజించి మనయుచుండఁడె రుద్రా.
తనకొడుకుఁ దునిమి వంటక, మొనరఁగఁ గావించి నీకు నొప్పు నివేదిం
చి[నదాన మెచ్చి]ముక్తికిఁ, బొనరఁగ(ఁ) జెలుతొండనంబి పోవఁడె రుద్రా.
కోరి తనశిరము నీపద, నీరజములఁ బూన్చి భక్తి నీలాపురి జం
బూరినుహోకాళయ్య యు, పారైశ్వర్యమును మగుడ(ఁ) బడయఁడె రుద్రా.
మొ(అ)టదనంకయ దనతల, లటిమెల్వకఁ దఱిగి నీపదాంబుజములఁ గ్ర
చ్చ(అ)ఁబూన్చి మగుడఁ బడయఁడె, నెఱయఁగ నిను నమ్మి భక్తి నీచేత శివా.
శిరము దెగఁగోసి నీపద, సరసిజములఁ బూన్చి నీప్రసాదంబున శం
కర మూనాన్మాళ్లకుఁ గరుణా, కర గోవిందుం[డు] [3]వడసెఁ గటకమున శివా.
వరగొండచక్రవర్తికిఁ, [4]గరుణింప జగత్త్రయప్రకాశితభక్తి
స్థిరుఁ డనఁ బడసె[ను]క్షితి నీ, పురమునకుం బొందితోన పోవఁగ రుద్రా.
తవిలి తనయూరి[5]యూబా, లవృద్ధముగ మున్ను సొనిపి లాలితముగ నీ
శివలింగముతోఁ గూడఁడె, శివ నీదయ నొడయపిళ్లె శీఘ్రమున శివా. ౧౦౫
ఒక్కఁడె దైవము శివుఁ డని, నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరం
గ్రుక్కక శ్రీపతిపండితుఁ, డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా. ౧౦౬
కడుఁ[6]జోద్యము భక్తులకును, గడుఁ గూర్చుట నీదుభక్తిగౌరవమునకుం
గడుమెచ్చి యొడయనంబికి, నెడవోయితిగాదె లంజయింటికి రుద్రా. ౧౦౭
త్ర్యంబకుఁడ దైవ మని చి, త్తంబునఁ గడు నమ్మి నిన్నుఁ దడయక భక్తిం
నంబియుఁ గిన్నెరబ్రహ్మయ, యుం బిలిచినఁ గరుణ వారికో యనవె శివా.
అమితదృఢభక్తి నీవదు(ఁ), గొమరుగఁ బరిజనులతోడఁ[7]గూడనె శివలో
కమునకు దేహముతోడన, రమణీయము గాఁగ మలయరా జరిగె శివా.[8]
హాలీలాస్తవరచనా, స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడం
సురుచిరవిమానమున నీ, పురమున కుమ్మటుఁడు [9]ప్రీతిఁ బోవఁడె రుద్రా.

---

1. మును. 2. బూజించుచున్న నొప్పంగ. 3. వడసెం. 4. గరుణించి. 5. యాబాల వృద్ధులును. 6. జోద్యముగ. 7. గూడండె. 8. ఈ పద్యము తరువాత "తన కొడుకుఁ దునిమి" యను పద్యము మరల వ్రాయంబడినది. 9. ప్రీతి.

ఒకఁబకఁ గుమ్మగగుండయ, వడి(ఁ) గడనలుచేసి చ(ఱ)చువాద్యములకు న
క్కడఁ బ్రీతి [1]నాడి తప్పుడు, బెడ(ఁ)గడరఁగ నతనిభక్తి పెంపునకు శివా. ౧౧౧
[2]నరు లెల్లం జూడ నిజో, దరము ప్రవేశింపఁ గాదె తనకట్టిన[3]యం
బర మొకమూరెఁడు దోఁపఁగ, నరియమరా జరిగె [4]ముక్తుఁడై నీకరుణన్.
భయముసెడి నిన్ను నమ్మిన, జయమునఁ దరియఁబడి నడచుసాహసమున నీ
దయ నిండిపా(ఱు)నది దా, రయముడిగెను ముసిఁడిచౌండరాయనికి శివా.
తనుఁ గని మ్రొక్కిన"దీర్ఘా", యని పలికినపిదపఁ జచ్చె నాఁటది[5]తగు నే
యనఁ బ్రాణమునడసెను వా, రనిదయతో ముసిఁడిచౌ[ం]డరాయఁడురుద్రా.
తనలంజయునుం జిక్కయు(ఁ), దన[6]లంజియబంధుజనులు దానును జనఁడే,
జనులెల్ల(ఁ)జూడ మలహణు, నిను సంస్తుతిచేసి దేవ నీపురమునకున్. ౧౧౨
వెలయఁగ[7]నాఁబోతులుఁదప,సులుమృతులై[8]యెదురరాఁగ(ఁ)జూచుచు(ఁ)బ్రా
బులునడయఁడె నీదయ వా, రలకప్పుడె ముసిఁడిచౌ[ం]డరాయఁడురుద్రా.
పెనిమిటి శివభక్తుఁడు గా(ఁ), డని యొల్లక రోసి నిన్ను నడిగిన రాత్రిన్
జనఁ బడసెఁగాదె శంకర, గొనకొనఁ [9]బుంస్త్వమ్ము నాఁడుఁగూఁతురు నీచేన్.
కెంబాగి బోగిదేవని, వెంబడిఁ జని వచ్చి వీడుఁవీరంబుల లిం
గంబులు వడి [10]విప్రులు లీ, లం బొగడఁగ నిట్టినత్సలత్వము గలదే. ౧౧౩
విన్నపముసలిదియంబలి, మున్ననిని వేద్యంబు సూపి మ్రొక్కుచు నీకున్
సన్నుతభక్తిని మాదర, చెన్నయ నీకరుణ [11]ముక్తి చేకొనఁడె శివా. ౧౧౪
కూడి జగమెల్ల నోపక, [12]యోడినశివభక్తిమహిమ యుత్కృష్టముగా
[13]నేడర బంకయ చూడఁగ, దేడర దాసయకుఁ దలువు [14]దెఱవవె రుద్రా.
శంకర నీకింకరుఁడ, భ్రంకపముగ నేత్రవహ్ని(ఁ) బరదైవములన్
బొంక [15]మడఁగింపఁడే భువి, శంకరదాసయ్య నీప్రసాదమున శివా. ౧౧౫
[16]కడవఁగనేరక మ్రొక్కిన, నడు [17]మప్పుడు వ్రస్సిపడ జినప్రతిమ మహిన్
బడియందునైజకవ్వకుఁ, బొడసూపవె లింగమూర్తి(ఁ) [18]బురహరదయతోన్.
కడిచేసి వెట్టఁగాఁ గొని, నడిసనఁ గటకమున సురియచముఁడయగారిన్
గడు(ఁ) గరుణించి [19]జగమ్ములు, గెడఁగూడి నుతింప నారగింపవె రుద్రా.

---

1. నాతిదెప్పుడు. 2. నరుదెల్లంజూచరము. 3. యమయంబ్బర. 4. ముక్తుండే. 5. గునై యనంయనంబ్రాణముడడసె. 6. లంజయు. 7, నాబొంతులు. 8. యెదురాంగ, 9. బుస్వత్వ మాండుం. 10. విపులిలం. 11. భక్తి. 12. యాడిన. 13. నేడరబకయం. 14. దెలవెలె. 15. మడిగింపప్పం. 16. కడవంగనేరక. 17. మప్పుడుస్సిపడజన. 18. బురహడ. 19. జగములు.

టా ముందరఁ [1]జవి సూచిన, యామాంసము నీకుఁ బెట్టి యతిశయభక్తిన్
వ్యామోహంబున నీవయ, గా ముక్తికిఁ జనఁడె [2]యె(ఱు)కగన్నప్పఁ డభా. ౪౨౫
[3]భావనయభక్తి నీకును, భూవినుతుఁడు మేలుకబ్బములు సెప్పి మహా
దేవ తన[4]దృష్టి శివలో, కావాప్తిం బడిసెఁగాదె యంబన నీచేన్.
ఇమ్ముల [5]విపినమ్ముల ని, త్యమ్మును శివలోకమునకుఁ దడయక చనవే
నమ్మిన నీభక్తుం డగు, జొమ్మయ [6]చంపినమృగములు చోద్యముగ శివా.
స్థిరభక్తియుక్తిఁ దృణమున, నరుదుగఁ[దా]నిలిచి భక్తుఁ డనుదయఁ గంచిం
గరికాలచోడ[7]నృపతికిఁ, గురియింపవె పసిఁడివాన గోరినభంగిన్. ౪౨౭
అవిరతదృఢభక్తిం గే, శవరాజు శిరంబున[ందు] సన్నిహితుఁడ వై
భువి లింగమూర్తి సేకొని, యవతారము చేయవే మహామహిమ శివా. ౪౨౮
పూని వడి నేడురినాళుల, పీనుఁగునకు వీరభక్తిఁ [9]బ్రీతాత్ముఁడవై
ప్రాణం బొసఁగితిగాదె ద, యానిరతిం గదిరిరేమగార్యునకు శివా. ౪౨౯
నీపురమునకు[న్]శివ నీ, ధూపా[వ]సరమున ఘంటతోడనె భక్తి
వ్యాపారంబున నోహిళుఁ, [10]డాపోయె ననంగఁ బోవఁడయ్యెనె రుద్రా.
అసమేక్షణ శివభక్తుం, డసమశ్రేష్ఠుఁ డని పలికి యన్యులతోడన్
బొసపోరై బండారువు, బసవఁడు విసమెత్తి త్రావి బ్రతుకఁడె రుద్రా.
వసుధ నుమేశుఁడె దైవము, ప్రసాదము పవిత్ర మీశుభక్తులె కులజుల్
పొసపో రని బండారువు, బసవన విస మెత్తి త్రావి బ్రదుకఁడె రుద్రా. ౪౩౨
కుసుమశరారీ శివలిం, గసమేతులు దక్కఁ బొందఁ గాదని నిర్మా
ల్యసుఖం బని బండారువు, బసవన విసమెత్తి త్రావి బ్రతుకఁడె రుద్రా. ౪౩౩
అలపూరివీరభక్తికి, నలి నెంతయు మెచ్చి పాండ్యనాయకు[కడకి]
మ్ముల నీవ వచ్చి పీఠము, వెలయఁగఁ జేకొంటికాదె విష్ణువరేణ్యా. ౪౩౪
స్థిరభక్తి నీకుఁ బాడుచు(ఁ), బురహర తనచేతితాళములతోడనె చె
చ్చెర మీ(ఁ)దికి నెగసి భవ,.త్పురమునకు[ను]శంకరుండు పోవఁడె రుద్రా.
కొడుకని చేకొని నిన్నును, మడఁది[యతి]ప్రీతి బెజ్జమహాదేవి మహిన్
గడకొనియాడినభక్తికి, నొడఁబడి యాయమకు [11]ముక్తియొసఁగవె రుద్రా.

---

1. జని. 2. యెఱుకఁగన్నప్ప. 3. భావనియనిభక్తి. 4. ద్రిష్టి. 5. విపినముల.
6. చప్పిన. 7. నృపతిం. 8. నాళ్ల. 9. బ్రీతాత్ముండై. 10. డాపాయె. 11. భక్తి.

తన[1]గుఱ్ఱము సతులును బరి, జనులును దనతోడ రాఁగ శాశ్వతభక్తిన్
జనియెభవత్పురమునకు[ను], [2]గొనకొనఁగఁగొమారపాలఘూర్జరుఁడుశివా.
గుడినడుగు దాఁచి కుంచియ, పొడసూపక తలుపువెట్టిపోయిన నీవ
ప్పుడె తలుపు దె(ఱ)చి భక్తికిఁ, బొడసూపవె కిన్నెరునకుఁ బురసంహారా.
కడుఁగడురౌద్రంబున జ[త], పడుమదకరి(ఁ)జంపి యపుడ [3]పడయఁడె భువి ను
క్కడఁగియు బిజ్జలుఁ డడుగుడు, మడివలుమాచయ్య భక్తి [4]మహిలోఁ గలదే.
చోడని[5]యేనుఁగుఁ జంపుచు(ఁ), చోడనిశివభక్తిమహిమచొప్పడ నీచే
రూఢిగఁగ్రమ్మ(ఱ)ఁబడయఁడె, [6]మోడకయిఱుదత్తుఁడనఁగ నొకభక్తుఁడజా.
రావీధి యేచి యెక్కిన, మానంతునిఁ జంపి వచ్చు[7]మదకరి దనపై
[రా]వె(ఱ)చిమగుడఁ బా(ఱ)డె, బావురి[8]బ్రహ్మయకు నీప్రభావమున శివా.
భూతలమున నిది యంతయు, [9]నూతన మని పొగడ నేడునూ(ఱే)ండ్లు మనం
డే తనరుభక్తిఁ ద్రిపురా, రాతీ సకలేశు మాదిరాజయ్య శివా. ౨౨౨.
[10]ఎడపక పూజాంతమునన్, [11]చిడిముడిపడి ఘర్ఘరములు సెలఁగఁగ నీ వె
ప్పుడు మెచ్చి భక్తి కాడుదు, వడిఁ జేమరచక్రవర్తి వాయింప శివా. ౨౨౩
నమ్మినభక్తుఁడుఁ గన్నడ, [12]బమ్మయసద్భక్తిమహిమ పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యముగాదె య, ధర్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా.
పసవడి మ(ఱి)యు ననేకులు, ధర బాణమయూరకాళిదాసాదిమహా
పురుషులు [13]దృష్టప్రత్యయ, వరములు నినుఁగొలిచి కనిరి వరభక్తి శివా.
వలయునని దేవ [14]కొంద(ఱ), నెలకొని పేర్కొంటిఁ గాక నీచేత వర [కున్.
మ్ములు వెలయఁగఁ బడసినభ, క్తులకొలఁదెఱుఁగుదునసంగఁ గొలఁదియె నా


భక్తిమహిమ.

[15]మహిలోఁ గేవలభక్తివి, రహితములై చేయఁబడికరంబును దుఃఖా
[16]వహమై దక్షుఁడు సేసిన, విహితక్రియ [17]లెట్టు లట్లవిఫలంబు లగున్.
నీపదభక్తుఁడు సేసిన, [పాపంబు]ంబుణ్యమగు[18]నభక్తులుసేయన్
[19]బాపమగుఁ బుణ్యమైన ను, మాపతి [20]నీతలఁపె వేదమార్గం బయ్యెన్.
మొల్లల వైచినలక్ష్మీ, వల్లభ[సుతుఁ] [21]గాల్పవే యవారితవృత్తిన్
[22]మొల్లమిగ ఱాల వైచిన, యల్లగణాధిపున కీవె యపవర్గ మజా. ౨౨౪

1. గుఱము. 2. గొరకొనఁగ. 3. పడయుండె. 4. మహిమంగలదే. 5. యెనుగం. 6. వోడక. 7. మదకరిందనపై. 8. బ్రహ్మయ్యకుని. 9. నూంతన. 10. యడప. 11. చిమ ణిగ. 12. బ్రంహ్మను. 13. దంష్ట్ర. 14. కొందరు. 15. కావునం. 16. వహమయ్యె. 17. లెట్లట్లవిఖవంబులగున్. 18. ను. 19. బాపమగుపుణ్య. 20. నీవలపె. 21. గొల్వవె. 22. మొల్లముఱిఱల.

కావున సకలక్రియలును, గేవలభక్తిప్రయుక్తికిని సరిగామిఁ
గేవలభక్తియ మేలని, గోవిందవరేణ్యు [1]నరదుఁ గొలువవె శంభుఁ. ౭౫౦
వనజాననవనజోదర, సనకాదుల కెఱుఁగరానిశాశ్వతమహిమఁ
దనరినభక్తికి శంభుఁడు, నొనరఁగ(ఁ) గడు మెచ్చి భక్తునొద్దన యుండుఁ.
ఈనిచ్చలుఁ గొనియాడెడు, నానావిధము లగునిత్యనైమిత్తికక
ర్మానుష్ఠానము లొల్లఁడు, దా నెప్పుడుఁ గూర్చు శివుఁడు దనభక్తునకుఁ.
ఫలములు గుఱుతిడి శివపూ, జలు చెప్పెడిచదువు లెల్ల శాశ్వతపదవిఁ
వెలసిన కేవలభక్తి, [2]స్థలముల వర్ణించి చదువఁ [3]దద్దయుఁ దగునే. ౭౫౩
శ్రీలింగదేవుభక్తుల, కాలక్ష్మీశాబ్జసంభవాదులపదవుల్
తూలాయమానములు న, ల్లీల శివానందసుఖవిలీనుల యగుటన్. ౭౫౪
కేవలము శివుఁడుఁ దనకుం, [4]గావలె నని గోరునట్టిఘనుఁ డెవ్వండే
గేవల మాతఁడ తనకుం, [4]గావలె నని కోరు నట్టికాంక్షన శివుఁడుఁ. ౭౫౫
ఇది విధినిషేధము[లు]గల, చదువులకును స్వామిభృత్యసంబంధమునం
బొదలిన కేవలభక్తికి, నొదసినకూటంబు గలదె యూహింపంగాఁ. ౭౫౬
ఫలియించు విధినిషేధం, బులవలనను బుణ్యపాపములుఁ దత్కర్మం
బుల నగు నయ్యై[5]లోకం, బులు భోగాంతమున మఱియుఁ [6]బుట్టుక కలుగుఁ.
కావున[ను] విధినిషేధవి, భావనుఁడై యుభయకర్మఫలవిరహితుఁడై
కేవలనిష్ఠ[ం] గొలుచుట, భావింపఁగ శుద్ధభక్తిపథము ధరిత్రిన్. ౭౫౮
పరమేశ్వరుఁ డగుశంభుఁడ, శరణం బని భక్తి [7]నమ్మి శంకరుఁ గొలువన్
దొరకొను భృత్యాచారము, సరియే పెఱమంత్రతంత్రజాలము లెల్లన్.
[8]విధి వే(ఱ)కలదె భక్తియ, [8]విధి విధిసహితముగ భక్తి[9]విరహితుఁడై తా
[8]విధియించియశ్వమేధము, [8]విధిపుత్త్రుఁడు దక్షుఁడైనవిధి[10]యెఱుఁగరొకో.
[11]పృథువిధినిషేధలోక, [12]ప్రథితోభయకర్మరాశిఁ బ్రాపించె నీ
[13]"పథవర్తిని తేషాయమ, యథాతథా"యనుటఁ జేసి యంబారమణా.
[14]శివునకుఁ దనువును మనువును, శివభక్తులకును ధనంబుఁ జిత్తప్రీతిన్
భువి నిచ్చి యెల్లవారికి, శివుఁడను నేననక యునికి శివభక్తి యగున్. ౭౬౨

1. వరదు. 2. స్థళములు. 3. గద్దయు. 4. గావలనని. 5. నయ్యైలోకంబుల. 6. బుట్టుగ. 7. నమి. 8. విది. 9. విరహామందెలా. 10. యఱుంగరణా. 11. పృదు. 12. ప్రది. 13. పద. 14. దీనికిముందు "శివుగురులకునను దనువులునకుందనువునుమనవును' అను నసంపూర్ణానర్థకవాక్యమొండు గలదు.

వెలుపలఁ గడిగిన లోపల(ఁ), గలచిత్తమలంబు వోవఁగా నేర్చునె నీ
చ్చలుభావశుద్ధిఁ గడని, ర్మలమతి శివుఁగొలువవలయు మానుగ భక్తిన్.
కత్తిఁ గొని కోసి దేహము, జొత్తిల్లఁగఁ గడిగినను విశుద్ధం బగునే
రిత్తలు దక్కిన శుద్ధుల్, చిత్తంబున శుద్ధి వలయు శివుఁ బూజింపన్. ౪౬౪
ఒడలఁ గలయవయవంబులు, [1]గడిగిన మఱివానిలోసఁ గడునిండిన చేఁ
దుడుగునె దేహము వెలుపల(ఁ), గడిగిన నదిచిత్తశుద్ధికారణ మగునే. ౪౬౫
అంతర్గతచిత్తంబ, త్యంతము దుష్ట మగునేని యది [2]మఱి ఘట[3]దృ
ష్టాంతగతి శుద్ధి యగునె ని, రంతరబహుపుణ్యతీర్థయాత్రాదులచేన్. ౪౬౬
సకలజగత్పతి యగుశివు, నికి భక్తులు [4]పేరు నాఁగ నెగడిన పుణ్యా
ధికులం దొండొకదుర్గుణ, శకలంబులు వెదకుపాపజాతులు గలరే. ౪౬౭
ఆతఁడు స్వరూపసుందరుఁ, డాతఁడె సౌభాగ్యవంతుఁ డాతఁడు గుణవి
ఖ్యాతయశోనిధి నీకుమ, హాతాత్పర్యమున భక్తుఁ డగువాఁడు శివా. ౪౬౮
ఆతఁడ జగ[త్ప]విత్రుం, డాతఁడ [5]సంపత్సమృద్ధుఁ డాతఁడ యారో
గ్యాతిశయాఢ్యుఁడు నీకు మ, హాతాత్పర్యమున భక్తుఁ డగువాఁడు శివా.
శివ[6]సంస్కారవిహీనుం, డవుమానవుఁ డంత్యజునకు నంత్యజుఁ డరయన్
శివసంస్కారనియుక్తుం, డవుమానవుఁ డగ్రజునకు నగ్రజుఁ డరయన్. ౪౭౦
మాలలఁ గులజులఁ జేయును, బోలఁగ శివభక్తులైన భువి నెఱుఁగరె మా
నీలగ్రీవుఁడు గులజుల, మాలలఁగాఁ జేయు భక్తి మది లేకున్నన్. ౪౭౧
చెన్నయ మాలఁడు గాఁడే, మున్ను మహాదేవుఁ గొలిచి ముక్తుం డయ్యెన్
జన్మమున శివుని దక్షుఁడు, మన్నింపమిఁ జేసి [7]పచ్చిమాలం డయ్యెన్. ౪౭౨
వేయేమి దొల్లి ముక్తికి(ఁ), బోయిరె విద్యలు[ను]వంశములు గలవారల్
బోయయు [8]సాలీఁడును మా, కాయజహరుఁ గొలిచిముక్తిఁ గాంచిరె గాదే.
వారనియమనియమములకు, ఘోరవ్రతములకు శివుఁడు గూర్పఁడు శివనిం
దారతి విని తను విడిచిన, [9]గౌరీసతిభక్తియుక్తిఁ గనికూర్చుక్రియన్. ౪౭౪
జపములకుం దపములకును, నుపవాసంబులకుఁ గూర్పఁ [10]దుగ్రుఁడు నిందా
కుపితమతిఁ దన్ను విడిచిన, యుపమన్యునిభక్తియుక్తి కొడఁబడుపగిదిన్. ౪౭౫
కన్ను వడిఁ బుచ్చి పూన్చిన, వెన్ననిభక్తికి వరంబు వెదచల్లుక్రియన్
గన్నులు దె(ఱ)వకముందర, మిన్నక కూర్చున్న శివుఁడు మెచ్చునె వారిన్.

---

1. వెలుపలగడిగిన. 2. మటి. 3. దృష్టాంతర. 4. పేరుపేరునాంగ. 5. సముద్ధుడా. 6. సంసార. 7. పచ్చ. 8. సాలీనుండు. 9. గౌరిపతి. 10. దుగ్రూరుంజునిందా.

తనతండ్రిఁ దునిమి భక్తిం, దనరినచండీశ్వరునకుఁ దనయెంగిలి యి
చ్చినక్రియ శివుఁ[1]డిచ్చెనె పెఱ, జనులకుఁ గేవల[2]వదాన్యజనులకు నెందుఁన్.

మన్నించుఁ బ్రీతి మాదర, [3]చెన్నయభక్తియ [4]మనమునఁ జేకొనఁ[5]గాదే
మిన్నక యంటనిముట్టని, చెన్న(ఁ)టివ్రతములకు నేల శివుఁ డెడఁగూర్చున్.

[6]ప్రీతిమెయి వీరచోడన, భాతిగఁ గడియెత్త వె(ఱ)చి పనుచుఁడును రజ
స్నూతకి యని తొలఁగెనె నృప, కేతనుఁ డాపులగ మారగించెడిచోటన్.

ఉన్నతభక్తి శిరంబులు, పన్నుగ శివుఁ బూన్చి కరుణ వడసినభంగిన్
ము న్నేవిధులం గొలిచియుఁ, జన్నదశానసుఁడు వడయఁజాలెనె చెపుమా.

తొల్లి శివుఁ గడవఁబలికిన, కల్లరిఁ దనతండ్రిఁ దునిమి కడుభక్తిమెయిన్
దెల్లమిగ ముక్తుఁ డయ్యెను, గొల్లఁడు గాఁడయ్య కాటకోటఁడు రుద్రా.

మును సవినూచినకన్న, పునియెంగిలి యారగించి భక్తిప్రధానం
బని కరుణించెను శంకరుఁ, డని విందుము విధులలోన నది యేవిధిమో.

మ(ఱి)శివుఁడు భక్తిఁ గొడుకుం, ద(ఱి)గినచిఱుతొండనంబి దనవాఁడనుఁ[7]గా
కె(ఱు)ఁగక యేటికిఁ గారులు, మొఱిగెడునీమంత్రతంత్రములు సేకొనునే.

కడుభక్తి నంబి పిలిచిన, నొడఁబడి యోయునినభంగి నొండొకవిధులన్
నొడువులు సెప్పిన [8]వ్రేళులు, మిడిచిన శివుఁ డట్టివారి మెచ్చునె చెపుఁడా.

ఆగమచర్యల కంత, ర్యాగబహిర్యాగవిధుల కభ్యాసమహా
[9]యోగమ్ములకుం బోయెనె, భోగన్నకు శివుఁడు వలచిపోయినభంగిన్.

అధ్యాత్మజాలకుఁ బె(ఱ)మూ, ర్తిధ్యానంబులకు నితరదేవార్చనకున్
విధ్యుక్తక్రియలకు సా, న్నిధ్యమగునె శివుఁడు [10]బాణునికిఁ గాక భువిన్.

నిష్ఠురభక్తి హలాయుధు, నిష్ఠకు నలచినవిధమున నీదగుకర్మా
నుష్ఠానములకు బిలబిలి, నిష్ఠలకును శివుఁడు నలచునే తలపోయన్. ౪౮౭

[11]మరి విను మొరులవిధులకుం, గుఱియించెనె మెచ్చి లోకగురుఁ డీశుఁడు మా
కరికాలచోడనరపతి, గురుభక్తికిఁ బసిఁడివాన గురియించుక్రియన్. ౪౮౮

[12]స్నానములకు దానములకు, మానములకు హోమములకు మదిఁ జేకొనఁడీ
శానుఁడు నమ్మినభక్తికి, మానక* . . . . . . . ౪౮౯

1. డిచ్చిన. 2. పదాన. 3. చెన్నయ్య. 4. మనమునను. 5. గారే. 6. ప్రీతిమై.
7. గాకెఱుంగక. 8. వేళ్లు. 9. యోగముల. 10. మాణునకు. 11. మరువినుమోరు. 12. స్థానములకు.
* శ్రీగురవేనమో శ్రీగురవేనమస్తే గురుమూర్తిప్రథితగుణాయ । శ్రీశంభవే నమోశ్రీశంభవే నమస్తే శంభుసంచారచేతసాయ । శ్రీశ్రీజాయనూ—అని మూలమందుఁ జివరనున్నది. చివర పద్యము పూర్తిగ లేదు.

# లఘుటీక.

(ఇందలియంకెలు శివతత్త్వసారమందలి కందపద్యములసంఖ్యలను దెలుపును.)

౫. నీమూర్త్యాత్ముల - శివుని యష్టమూర్తులను.

౧౪. షట్త్రింశత్పర్వోపరిగత - ముప్పదియాఱుమెట్లపైఁ బై నున్న. శైవసంప్రదాయమునందు, తత్త్వములు ౩౬. ఇవి యొకదానిపైనొకటి యుండును గనుక పర్వము (మెట్టు) లనఁబడెను. చివరది (నిర్వాణసోమ) రూపము. ౩౬ తత్త్వములు:—పృథివి, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యము, శబ్దము, స్పర్శము, రసము, గంధము, ఆకాశము, వాయువు, వహ్ని, జలము, మాయ, కాలము, నియతి, కల, విద్య, రాగము, పురుష, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య, రూపము:

౧౫. దీనియర్థము చింత్యము. ఈతీరున దీనియర్థము కల్పింపవచ్చును. బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివు లనునైదుగురిని సాధారణముగఁ బంచకర్త లనివాడుదురు. (చూడు సంఖ్యార్థనామప్రకాశిక). మొదటి యిద్దఱైన బ్రహ్మ విష్ణువులకంటెఁ దరువాతివైన రుద్ర మహేశ్వర సదాశివరూపములు మూఁడును అధికమైనవి. ఈముగ్గురే నియామకారులు, ఆదిజగత్కర్తలు, ఆఢ్యులు, అతిమహిమలు. మూఁడని అమహత్తుగాఁ జెప్పినప్పుడు తత్త్వము లనియు, ముగ్వురని మహత్తుగఁ జెప్పినప్పుడు దైవములనియు నన్వయించుకొనవలయును. ఇంతియకాని ముగ్వురనఁగ బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనఁబడు త్రిమూర్తు లని యర్థము చేసికొనుటకు వీలులేదు. ఏలయన బ్రహ్మవిష్ణువులు కర్తలు కారని ౭౯, ౮౦ పద్యములలో గ్రంథకర్తయే చెప్పియున్నాఁడు.

౨౩. i. అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహిమాన్య - మాన్పఁబడునది పాశము, గనుక ఈసామాసికశబ్దము దానికి విశేషణముగ నుండవలయును. బద్ధపశు అనునది యిట్టి సమాస మని నాతాత్పర్యము. బద్ధాః పశవః ఏనసః అని విగ్రహము. ఇది పాశమునకు విశేషణము. లేదా ఇట్టివియే మఱికొన్ని విశేషణముల నూహించుకొనవచ్చును.

అజ్ఞానితషష్ఠీతత్పురుషానూనసమాసము - పశూనాంపతిః పశుపతిః (షష్ఠీతత్పురుషము). పశుపతేరిదం పాశుపతం (పశుపతి + అణ్). పాశుపతవ్రతముచేత బద్ధపశుత్వవిశిష్టమైన ఐహికపాశము తెగునని భావము.

ii. సోమనాథభాష్యము (౧౮౮ ప్రకరణము) నందుఁ గొందఱు "పశుపతి" శబ్దమునే బహువ్రీహిసమాసముగఁ జెప్పెద రది తప్పు; షష్ఠీతత్పురుషసమాసార్థమే నిజము, అని చెప్పఁబడి యున్నది. కావున, పశవః, పతయః, యస్య, అనఁగా పశువులనఁబడు నితరదేవతలే శివునికిఁ బతులు అని వైష్ణవాదులు విపరీతార్థము చేసియుందురు. దానిని షష్ఠీతత్పురుషమే మాన్పును. అని యీపద్యమున కొకయర్థము చెప్పవచ్చును.

౨౬. బ్రహ్మోక్త - వేదములలోఁ జెప్పఁబడిన.

౩౨. ప్రమితి - యథార్థజ్ఞానము.

౩౫. శబ్దంబున - ఉపనిషద్వాక్యములవలన.

౪౩, మతిపెండి - మతిమతి.

౪౬. పానలు - సందేహము.

౫౪. గతశిఖాగాయత్రీయజ్ఞోపవీతనాస్తికులు - జుట్టును, గాయత్రీమంత్రమును, జంద ముసు వదలిననాస్తికులైనవా రని భావము. ఇది యద్వైతసన్న్యాసులను వెక్కిరించుట. లింగధా రులలో సన్న్యాసులు లేరు.

౬౨. ఐశ్వర్యాద్వైతము - ఈశ్వరత్వమునకు సంబంధించిన అద్వైతము. తనకుసాటి వాఁడు లేనందునఁ గలిగిన యనన్యభావము. అంతఱకుఁ దాను ఈశ్వరుఁ డగుటవలనను, తనకు సమానుఁడు కాని యధికుఁడు గాని లేనందునను, ఒక్కఁడు అని చెప్పఁబడెనేకాని జీవుఁడు ఈశ్వరుఁడు ఒక్కఁడను నర్థమందు కా దని భావము.

౬౬. మాయావాదులముందట - మా (శైవులైన) ఆ (ప్రఖ్యాతులైన) వాదులయెదుట.

౭౪. తత్త్వాధిపతీ - దీనిని 'తత్త్వాధిపతి' యని దిద్దవలయును.

౯౪. పతి - యజమానుఁడు; సదృశ - సమానుఁడు; అధిక - ఎక్కువైనవాఁడు.

౯౬. నివృత్త్యాదికళాపంచకము - నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతము అనునవి శైవులకళాపంచకము. (సంఖ్యార్థనామప్రకాశిక.)

౧౦౫. వసుసన యనలేదు - వసుస తప్పకుండ నొకరితరువాత మఱియొకరు ముక్తికిఁ బోవ లయు నన్ననియమము లేదు.

౧౧౪. 'మద్భక్తశ్చ శ్వపచో' యని మూలపాఠ ముండవచ్చును. పాలకుఱికి సోమనాథుని చతుర్వేదసారమునందు 'శ్వపచోపి మమప్రియో' (శివపురాణము), 'శ్వపచోలింగపూజకో' (స్కాందము), 'శ్వపచోపి మునిశ్రేష్ఠో యస్తు లింగార్చనే' అనిపురాణవచనము లుదాహరింపఁబడి నవి. (౭౩-వ పద్యము).

౧౧౯. భూతిశాసనధరుఁడై - 'భూతశాసనధరుఁగై' యని యుండవలయును.

౧౨౧. అవిచారంబున - వెనుక ముందు చూడక, త్వరగ.

౧౩౩. వలచిన - సువాసనకొట్టిన.

౧౩౭. శివభక్తులనావారే - దీనిని 'శివభక్తులునావారే' అనిదిద్దవలెను.

౧౩౯. వరవుడు - దాసి.

౧౪౪. [శిష్యుఁడు] ఆదిఁ (మొదట) [తన] గురుఁడు [తనకు] కఱపినవెరవున (విధముగ) చని (నడచుకొని, ఆచరించి), మీఁద (తరువాత) [ఆశిష్యునకు] భక్తి (శివభక్తి- ఎక్కుడుభక్తి) వేదిం చిన (పట్టుపడఁగా) [నతఁడు; తము (గురువగుతనను)] గడచిచేసినఁ (భక్తియే ప్రధానముగనెంచి గురువునాజ్ఞప్రకారము చేయక యన్యవిధముగ గొప్పభక్తుఁడై తనభక్తిని గనఁబఱిచినయెడల) అగ్గ రుఁడు [ఆశిష్యునిమీఁదఁ గోపింపక తనశిష్యుఁ డంతవాఁ డాయెనని సంతోషించి] పరవశుండై భక్తుండన్నుఁ మఱపవలయును.

౧౫౦. అనుదేహ - ప్రతిదేహ.

౧౬౩. వక్కండు - కృశింపఁడు, తగ్గఁడు.

౧౭౧. 'నమేభక్తాః ప్రణశ్యంతి' యనఁగ - దీనినిట్లు దిద్దవలెను. "నమేభక్తః ప్రణశ్యతి' యనంగ."

౧౮౭. "బత్తళి" యనుకర్ణాటకశబ్దము లేకుండ నీపద్యము నిట్లు దిద్దవచ్చును. క. క్షుత్తృష్ణాది[సమస్త]వి । పత్తులు జలతపన[శీత]బాధాది. ఇత్యాది.

౧౮౯. పుచ్చిన - పెఱికిన.

౧౯౪. శ్వపచునకుఁ గీడు=శ్వపచునకుఁ గ్రిందివాఁడు, మాలవానికంటెఁ దక్కువవాఁడు.

౧౯౫. పలమెత్తు ప్రత్తికిఁ గుల మంతయు సమ్ముడుపోయినకథ యేశైవపురాణమం దైనను గలదేమో. పెరియపురాణములో - నొక భక్తుని కౌపీనములో రాజు నైశ్వర్యమును గుటుంబమును సరితూఁగలేకపోయె నని కథ కలదు. దీనికి దాని కేమైన సంబంధము గలదా.

౧౯౬. ప్రువ్వులు = పురుసులు.

౧౯౭. కొన్నిటినాళ్లల్ - కొన్నినాళ్లు మట్టుకు. స్వల్పకాలమువఱకే యని భావము. మెఱయలక్రియ "మెఱియలక్రియ" నని దిద్దుకొనవలయును. మెఱియ యనఁగా గుంట్రాయి. దినవారములు చేయునపు డొక ఱాతియందుఁ బ్రేతనారోపించి దానిమీఁద నీళ్లు పోసి నువ్వులు దర్భలు మొదలయినవివేసి, దానికే పిండములు పెట్టెదరు. ఆఱాతివైభవము పదిదినములే. పిదప నుండదు. మీసముమీఁది మెదుకులమెరపుల్- ఎట్లు క్షణభంగురములో- కొంచెముకాలము మీసము మీఁద నుండి తరువాత భోజనముచేసినవాఁడు ముఖము కడుగఁగనే జాఱిపోవునట్లే శివునికృపలేని వైభవము లని భావము. ఇందు దృష్టాంతములు రెండు.

౧౯౯. పుట్టనని చచ్చిచానని పుట్టెడు = పుట్టినవి పుట్టినట్టుగనె లెక్క లేకుండఁ జచ్చుచున్నటువంటివి యని యర్థము స్ఫురించుచున్నది. ఈప్రయోగము చింత్యము. పుట్టనని చచ్చి, చానని పుట్టెఁడు - పురుగులు చచ్చునపుడు మరలఁ బుట్ట నని యనుకొనును. పుట్టునప్పుడు చావ నని తలఁచును. అనఁగాఁ బురుగులకు బ్రదికియున్నపుడు తమకెప్పుడు తప్పక చావు గలదన్న జ్ఞానముండదు. చచ్చునపుడు పునర్జన్మ మున్నదను జ్ఞాన ముండదు. ఇట్లవి యేవిధమైన జ్ఞానము లేక మరలమరలఁ బుట్టుచుఁ జచ్చుచు నుండును. అట్లే శివభక్తిలేని మనుజులు మరల మరల జన్మమెత్తుచు ముక్తికి దూరముగ నుందురు.

పుట్టుఁగని చచ్చి, చాఁగని పుట్టెడు - అనికాని, పుట్టఁగనెచచ్చి, చాఁగనెపుట్టి - అనికాని దిద్దవచ్చును. పుట్టిన కొలఁదికాలముననె చచ్చి చచ్చినకొలఁదికాలముననె పుట్టు నని యర్థము.

౨౦౦. రాజులు రట్టళ్లు = రాజులు రెడ్లు. 'రట్టడి'పదమునకు వాఙ్మయమునందుఁ బ్రచారము లేకపోయినను శాసనములలో నీశబ్దము విశేషముగఁ గానఁబడుచున్నది. రట్టడి, రడ్డి, రెడ్డి యని యాపదముయొక్క రూపవికాస మని తోఁచుచున్నది.

౨౦౨. మండ్రేయేనిక్ = బ్రతుకందలఁచితిరేని. మనుధాతువు.

౨౦౪. ఆలరి = దుశ్శీలుఁడు.

౨౧౦. కుటిలాత్మకుఁడు ధరియించు గోత్రము నెల్లం = ఇది తాటాకుగ్రంథములోనిపాఠము. కుటిలాత్మకుఁ డుద్ధరించు గోత్రము నెల్లం' అని యుండవలెను.

౨౧౫. అలగుల్ (బలహీనులు). శివుని కవిలియక్ (కవిలెకట్టకు) ఎక్కు.దురయ్య - అని నాల్గవపాదమున కన్వయము.

